# బిల్హణీయము

గ్రంథకర్త:
చిత్రకవి సింగరార్య విరచితము.



పబ్లిషర్:
కె. యం. రావు,
రాజమండ్రి.



టైటిలు పేజీమాత్రమే,
ఇంపీరియల్ ప్రెస్‌నందు ముద్రింపఁబడియె,
రాజమండ్రి.

# వైజయంతీ విలాసము

అను

# విప్రనారాయణ చరిత్రము.

గ్రంథకర్త:— సారంగు తమ్మయామాత్యుడు.

పాఠకులారా !!

ఇది విలాసమను యుపపదమును సార్థకముచేసికొన్న [illegible] ప్రబంధ రాజము. విజయ విలాసమునకు పిమ్మట నీవిలాస మత్యుల్లాస[illegible]ను గలి గించును. విప్రనారాయణుండను వైష్ణవ బ్రహ్మచారి యొక[illegible] నాయ కుడు. నాయకురాలొక వారవనిత. మధురవాణీ దేవదేవుల[illegible] నిద్దర వేశ్యకాంతలు విప్రనారాయణుని విటుని గాజేయ ననుకూల ప్రతికూల లై యపజయము నందినవారు దాసిగానుండునట్లు ప్రతిన గావించు కొనిరి. విటునిజేతునన్న దేవదేవి కపట యోగినియై యతని యండజే

[illegible] సికొని తుదకు విటునిగా జేసికొనెను

[illegible] గల వేశ్యమాత వాని నిలువెడ[illegible]

[illegible] నప్పుడు నీవొక సాధుపుంగవుడ[illegible]

[illegible] ము నిందు బొందుపఱచితిమి.

[illegible] యొక్కని చేతంబసిండిఁబెట్టి వే

[illegible] ఱొక్కని నానడు చక్క నొక్కచి

[illegible] బొందివిటుల్ తెలియంగ లేరుగా

[illegible] డి నేమమువార కాంతాకున్.

వెల రూ. 0—10—0.

[illegible] చ్చయ్య అండు సన్స్

[illegible] శ్వర బుక్ డిపో,

రాజమండ్రి

# వైజయంతీ విలాసము

అను

# విప్రనారాయణచరిత్రము.

గ్రంథకర్త:— సారంగు తమ్మయామాత్యుడు.

పాఠకులారా !!

ఇది విలాసమను యుపపదమును సార్థకము చేసికొన్న ప్రబంధ
రాజము. విజయ విలాసమునకు పిమ్మట నీవిలాస మత్యుల్లాస[...]ను గలి
గించును. విప్రనారాయణుండను వైష్ణవ బ్రహ్మచారి యీకథ[...] నాయ
కుడు. నాయకురాలొక వారవనిత. మధురవాణీ దేవదేవుల[...] నిద్దరు
వేశ్యకాంతలు విప్రనారాయణుని విటుని గాజేయ ననుకూల ప్రతికూల
లై యపజయము నందినవారు దాసిగానుడునట్లు ప్రతిన గావించు
కొనిరి. విటుని జేతునన్న దేవదేవి కపట యోగినియై యతని యండజే
[...]సికొని తుదకు విటునిగా జేసికొనెను
[...]గల వేశ్యమాత వాని నిలువెడ
[...]నప్పుడు నీవొక సాధుపుంగవుడ[...].
[...]ము నిందు బొందుపఱచితిమి.

[...]క్కని చేతఃబసిండిపట్టి వే
[...]ఱొక్కని నానడు చక్కనొక్కచె
[...]బొందివిటుల్ తెలియంగ లేరుగా
[...]డి నేమమువార కాంతలకున్.

వెల రూ. 0—10—0.

[...]చ్చయ్య అండు సన్స్
[...]శ్వర బుక్ డిపో,
రాజమండ్రి

# బిల్హణీయము.



పండితులచేఁ బరిష్కరింపఁబడియె.

చిత్రకవి సింగరార్య విరచితము.





పబ్లిషర్:

కె. యం. రావు.

రాజమండ్రి.

1937

[వెల రూ. 0—12—0



శ్రీరస్తు.

# బిల్హణీయము.

## ప్రథమాశ్వాసము.

శ్రీరామావనిజానిజాయతభుజా ♦ శృంగారశాఖామిళ
త్సారాకారలతాస్తనస్తబకభా ♦ స్వద్దంతవాసః కిసా
లారాళాలకభృంగరంగదఖిలాం ♦ గాంచత్ప్రసూనోత్కర
శ్రీరామాకృతికల్పకంబు మము ర ♦ క్షించుఁ బుధానందమై.

క. భవసరసిజసంభవముఖ
భువనస్థ సమస్త దేవ ♦ ముఖ్యుల కెలమిం
బ్రవిమలసుతి మ్రొక్కెద మ
త్కవితకు సంతతము సత్ప్ర ♦ కాశము కలుగన్.

క. ధర దోషోదకముల నిడి
గరిమన్ సుగుణామృతంబు ♦ గాంచు సుకీర్త్యా
కరవరమానసపదసం
చరసత్కవిహంసములను ♦ సంస్తుతి సేతున్.

తే. నిర్మలావయవమ్ముల ♦ నెమ్మి విడిచి
వ్రణములకుఁ బాఱు మక్షికా ♦ వ్రతతిభంగి
యొప్పులు గ్రహింప కెప్పుడుఁ ♦ దప్పు లరయు
కాకవులలోకముల నే ని ♦ రాకరింతు.

వ. అని యివ్విధంబున నిష్టదేవతా నమస్కరణంబును, సత్కవి పురస్కరణంబునుఁ గుకవితిరస్కరణంబును గావించి, యేనొక్కనాఁ డెక్కువయగు మక్కువం జొక్కి హృద్యవిద్యానవద్యులగు విద్వద్వాదులుఁ గొలువం గొలువుకూటంబున నధివసించి సమంచితగతుల నతులవైఖరి దీపించు నవసరంబున,

తే. చిత్రకవివంశదుగ్ధాబ్ధి ♦ శీతభానుఁ
డనుపమానోక్తి శ్రీసింగ ♦ రార్యసూనుఁ
డమిత కవితావిశేషజ్ఞుఁ ♦ డనఁగ వెలయు
నారసింహార్యకవి వచ్చి ♦ నన్ను మెచ్చి,

క. శ్రీపండిపెద్దిసత్కుల
దీపక, కాశ్యపసగోత్ర ♦ దివ్యాన్ననా
భూపాలకమకుటమణీ
శ్రీపదపాదాగ్రభూమి ♦ కృష్ణస్వామీ!

సీ. కుత్సితకాణాద ♦ కుత్కీలకవిభేద
సంశ క్తయుక్తి వ ♦ జ్రప్రహార
యణకాంక పాణి నీ ♦ యాటవీపాటన
చటులసూక్తి విహార ♦ పటుకుఠార
నిర్జితకృతజైమి ♦ నీయలోతూద్ధూత
సంస్కారవాక్యజం ♦ ఝూసమీర
దుర్మతవేదాంత ♦ దుర్మదవిచ్ఛేద
భాసురవచన ప్ర ♦ భావసార

తే: కావ్యనాటకలసదలం ♦ కారచతుర
సాహితీమహాసన్నాహ ♦ సరసహృదయ
పండిపెద్దికులీన సం ♦ పన్నిధాన
పాలితకవీంద్ర శ్రీకృష్ణ ♦ పండితేంద్ర.

వ. అని వినుతించి, వినుము! భవదీయంబులగు చతుర్దశవిద్యాప్రభావంబులు, సకల భాషావిశేషంబులు, సమస్త చమత్క్రియావినోదంబులు, నెన్న నిన్నరులకుఁ దరంబుగాదు. నిఖిలలోకంబులఁ గృతిముఖంబుగాఁ గీర్తి నిత్యంబగునట్టి కృతులయందు నాంధ్రిం బతిరమణీయంబు గావున, నొక్క పురాతనకథ నాంధ్రప్రబంధంబుగా రచియించి, రామాంకితంబుచేసి, యాచంద్రతారకంబగు సత్కీర్తింగాంచు మనిన నేనును సంతోషాంతరంగుండ నగుచు,

క. మున్నింద్రతనూభవునకు
వెన్నుండు సహాయమైన ♦ విధమున నే నా
సన్నుతసద్గుణగణసం
పన్నుం డాకవివరాధి ♦ ప సహాయమునన్.

క. శ్రీజనకసుతహృదయ స
రోజాతద్యుమణి కజ వి ♦ రూపాక్ష మరు
ద్రాజప్రముఖామర్త్య స
మాజాగ్రిణి కరిజనాసు ♦ మరుదసిఫణికిన్.

క. తుండీంద్రతుండనిభదో
ర్దండస్ఫుటకాండనిర్జి ♦ త మహోద్దండా
ఖండలరిపుకాండునకున్
ఖండపరశుచండకార్ము ♦ క విఖండునకున్.

క. సుందరపదారవిందమ
రంద ముదితబుధపురంద ♦ రమిళిందునకున్
కుందశరత్కుందవృష
స్యందన చందన కనద్య ♦ శఃకందునకున్.

క. వరధీధిక్కృత చక్రిం
గరథికి సౌందర్యహాసిత ♦ కరథికి వినమ

చ్ఛరధీకృతశరధికి దా
శరధికి ధృతశరధి కురగ ♦ శాత్రివరధికిన్.

క. హరితనయహృదయసారస
హరికి మహాసూనృతజిత ♦ హరి కతితేజః
పరిహాసితహరికి భవగజ
హరికి సదాపాదపంక ♦ జానత హరికిన్.

క. శాంతునకు దాసహృదయ ని
శాంతునకు నిశాంతనయన ♦ చాకోరయుగా
క్రాంతధరాజస్యకళా
కాంతున కానందభరిత ♦ కపికాంతునకున్.

క. రావణహరణునకు జితై
రావణచంక్రమణునకు ధ ♦ రారమణునకున్
భావనజనభరణునకున్
భావనయాభరణునకు న ♦ భంగరమణునకున్.

క. రామునకు నీలమేఘ
శ్యామునకు దివాకరాన్వ ♦ యాంభోధిసుధా
ధామునకుఁ బరశురామ వి
రామునకు సమస్తభూవ ♦ ర లలామునకున్.

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన బిల్హణోపాఖ్యానం బను మహా ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన,

పురవర్ణన.

తే. వసుమతికి నాభిభూతమై ♦ వరలునట్టి
భర్మశిఖరికి నుత్తర ♦ భాగమందు
దృపదలలితంబు సుజన సం ♦ దోహచరిత
దివ్యదేశంబు పాంచాల ♦ దేశ మమరు.

వ. అందు,

శా. శ్రీరామామణి కాటపట్టు, హరికిన్ ♦ శృంగారహాసంబుఁ, జె
ల్వా రత్నంబుల కెల్ల నాకరము, స ♦ మ్యగ్వాహినీపాలి కా
ధారం, బన్యదుగాసదంబు, విబుధ ♦ త్రాణంబు, రాజాప్తిచే
శ్రీరమ్యం బయి సింధురీతిఁ బురి ల ♦ క్ష్మీమందిరాఖ్యం దగున్.

క. ఆ పురము జయశ్రీలకుఁ
గాఁపురము, సమంబు ద్వార ♦ కాపురమునకున్
భూపురములలోఁ జెల్వగు
గోపురముఖచుంబితైక ♦ గోపుర మగుచున్.

క. సతత శిరస్థల విసర ద
దితిసుతతటినీతుషార ♦ దీప్రాబ్జములై
నుతికెక్కు సౌధరాజము
లతులిత శివమూర్తు లనఁగ ♦ నప్పురిలోనన్.

ఆ. కనకగోపురాగ్ర ♦ ఘటితగారుత్మత
రత్నరుచులు కుముద ♦ రాజులేడి
తొడరి మెసవఁజూచు ♦ దూర్వాంకురము లని
చను మృగేంద్రముఖము ♦ లునికి నులికి.

సీ. ఒకచోట వనబోఁడు ♦ లొకనీటు గొని మీటు
వీణలనాదంబు ♦ వేడ్కసేయ
నొకచెంగట నభంగ ♦ సకలాంగయుతమంగ
శమృదంగరవము ధిం ♦ ధిమి యనంగ
నొకవంక గతశంక ♦ నకలంక మృదుపంక
జాస్యలు చెలఁగి లా ♦ స్యములు సలుప
నొకచెంత వగకాంత ♦ లొగి వింతఁ గొని సంత
సముఖిూటి సరసగీ ♦ తములఁ బాడ

తే. వెలయు బహువిధ వాద్యసం ◆ వేద్యహృద్య
ఘుమఘుమార్భటి దిక్కులఁ ◆ గొమరు మిగుల
జనుల కానందరసము ని ◆ చ్చలుఁ జెలంగ
రంజితావనిజాని యా ◆ రాజధాని.

సీ. సురసాలసంతతి ◆ సురసాలసంతతి
గతి ఖగాలికి ఫలో ◆ న్నతి యొసంగు
మహితకాంచలములు ◆ మహితకాంచనముల
పోలిక నామోద ◆ ములు ఘటించు
కలితపున్నాగముల్ ◆ కలితపున్నాగము
లట్ల కొమ్మలతోడ ◆ నమరియుండు
రంభాదినటనముల్ ◆ రంభాదినటనము
కరణి మరుత్ప్రసం ◆ గములఁ బొదలు

తే. పనస లెంతయుఁ బనసల ◆ ఖ్యాతి ద్విజుల
కును బదక్రమసంయుక్తి ◆ కొమరుమీఱు
నగము లున్నతినగముల ◆ పగిది వనుల
నలరుచుండు విపత్రింబు ◆ లగుచుఁ బురిని.

క. ఆ వనములు ద్విజసందో
హావనము లతులితవృత్రి ◆ హావనములు స
త్పావనములు మార్గికసం
జీవనములు కలితభువన ◆ జీవనము లగున్.

మ. కులసంరక్షణులుౕ, సువాక్సుమహితుల్ ◆ గోత్రాహితుల్, జాతవే
దులు, ధర్మాత్ములు, భాసురాఖ్యభువనా ◆ ప్తుల్, సజ్జగజ్జీవనుల్,
కలితార్థపదు, లూర్జితార్యులు, కన ◆ త్కాంతుల్, తమోదూరు, ల
య్యిల ధాత్రీసురు లెంతయున్ విబుధు లై◆యింపొందుటల్ చిత్రమే!

సీ. చక్రిముఖులకుఁ గీడు • సలుపని రాజులు
దివిరి సత్త్వముల భే • దింపని యిను
లిల కుభృత్తులను వె • న్నియని కూర్మిపతులు
గోత్రవర్గము బల్మిఁ • గూల్పనిందు
లరికి చూర్ణోర్మము గా • నట్టిపూరుషసింహు
లనయంబు మూలనుం • డని మహేశు
లొకని దాపునఁ జేర • నోపని శ్రీదులుఁ
బుణ్యంబు దప్పని • పుణ్యజనులు

తే. సౌర! వీరన వీరన • మైకరతులు,
పరగుదురు పురి శుచిభాను • వంశు లగుటఁ
గువలయానందసంధాయి • గురుతమోప
శాంతినై పుణ్యనిధులు రా • జన్యవిధులు.

మ. ఒకశంఖంబునఁబొంగు నర్థపతి యు • ద్యోగంబు తామర్చ భజిం
పక రత్నాకరుతోడి సఖ్యమునకుం • బాటించి సంఖ్యాధిక
ప్రకటార్థాఢ్యతచేఁ జెలంగి బహుమి• త్రప్రాభవాఖండరూ
ప కళా భూరివిభూతిఁ గాంతురు పురిన్ • వైశ్యోత్తముల్ వేడుకన్.

క. హాలపాణి యొక్కయేరుం
గలవాఁడని తెల్లజేసి • కడువేడ్కఁ బురిం
గల విష్ణుపాదజావళి
యలరారె సువర్ణయుక్తి • వ్యవసాయమునన్.

చ. సరసిజబాంధవుండు ముస • చాయ ననూరుఁడు తేరుదోలను
స్థిరతరతన్నిబద్ధవర • జిహ్మగపాశము లోలి వ్రేలన
ప్పూరి కరు లబ్జనాళములె • పో యని తుండము లెత్త దక్షిణో
త్తరమల నేగు భీతివెఁడియుఁ • దజ్జగతీక్షణుఁడై రయంబునన్,

చ. వరుస నిజేశు ము ల్లఁబడ • వైచినయట్టి మరుత్తరంగ ముల్
సరిగొనఁ జవంబు గొని • సాగిన నాశుగమై సమీరగుఁ డ
ర్చిరహితుఁడై రాఁ దదాకృతి హ • రించెఁ బదోద్ధతధూళి కప్పి త
త్పురి తురగోత్తమంబులు వి • భూషితసాదిబలోత్కరంబులై.

చ. సములు గావు వాజు లని • సారథి కుంటని గాలికూడుప
పగ్గములని చక్రి మొంటి దని • గాద్రిలు ననంతమణివ్రజప్రభా
వమహితమై ఘనావరణ • వైఖరితో నలరారు రాజితో
త్తమరథరాజి భానునిర • థంబు హసించు సదా సముద్ధతిన్.

క. కట్టింతురు రుద్రునయిన,
దట్టింతురు హరులనైనఁ • దలఁగని కడిమిం
గొట్టింతురు యమునైనను,
బట్టింతురు రిపులనెల్ల • భటు లప్పురిలోన్.

సీ. తమ్ముల దోషాప్తిఁ • గ్రిమ్మి మూసినయట్టు
నయశాలులను బొట్టో • నరుచ్చకోటిఁత
థాత్రిమహాహను • దండనిల్పినసడి
కలసదావర్తుల • గార్చునగడు
భోగి నధోగతిఁ • బొందించు పాతకం
బాదిత్యకపుల నే • లడఁచుకొదవ
కడుఁ గళానిధిఁ దమో • గ్రస్తుఁ జేసినదూఱు
ఘనులవివర్ణతఁ • గలపు కలఁక

తే. నలువ తప్పించుకొనియెఁ ద • న్నగరిసతుల
యలరుపదములు, మృదుజంఘ • లరిదిపిఱుదు,
లభఘనాభులు, మెఱుఁగారు • వలుదకుచము,
లమ్ముఖమ్ములు, వరకుంత • లము లమర్చి.

ఉ. కాంచన పద్మరాగ శశి ♦ కాంతమణీగణకల్పితోజ్జ్వలో
దంచితసౌధరాజములు ♦ తత్పురి నొప్పె ధ్వజాన్వితంబులై
మించినభీతి పత్త్రియుత ♦ మేరుముఖాచలపంక్తులెంతొ నే
తెంచె ననంగ భూతిసమ ♦ తేందుశ్రీడుగాన ధరేంద్రు పాలికిన్.

—♦ పుష్పలావికావర్ణన ♦—

సీ. నెత్తిమిమ్మదేకాంతు ♦ నీ వికవదలించు
నీవిక వదలక ♦ నేవిధంబు
సిఁకుల్కు-చెండ్లేవి ♦ పైకమ్మ దప్పించు
పైకమ్మఁ దప్పనే ♦ చేకొవంగ
నెంత నీకై దండ ♦ నిచ్చేనటే మేలు
కైదండ యిత్తురే ♦ కర మెడలక
భావింప గుచియేమొ ♦ బంధుజీవం బేది
యీబంధుజీవనం ♦ బెందుగలుగు

తే. ననుచు వీథుల సరస న ♦ ర్మానుకూల
వచనరచనల మెలఁగుచు ♦ వరలు విటుల
కనుగుణంబుగఁ బలుకుచు ♦. ననుదినంబు,
వెలయుదురు వీటఁ బుష్పలా ♦ వికలుఁ బ్రీతి.

వ. మఱియు నప్పట్టణంబు మణిఘటిత కాంచన ఘనావరణంబులును, ఘనావరణ నివారణ పటు పటాంచ లానిల కేత నాంచిత సౌధ రాజంబులును, సౌధోపరి నిబద్ధ ముక్తామయ శిరోగృహంబులును, గృహాగాజిత మణి కవాటంబులును, గవాట విరచిత మరకత మణి శోభా విరాజమాన తోరణపరికాశిత ద్వారంబులును, ద్వారోభయ పార్శ్వ రమ్య రత్నవేదికలును, వేదికాంతర రచిత విద్రుమములును, విద్రుమ వైడూర్య స్తంభ సముదయంబులును, స్తంభ సంభృత శాత కుంభ కుంభ విలసిత మంటపంబులును, మంటపాభ్యంతర

సంచర త్సుందరీజనంబులును, జనసందోహ సంపూరిత వీధికారాజంబులును, రాజకుమారారూఢ సంచర ద్గంధ సింధుర సైంధవ రథనికరంబులును, కరవిన్యస్త వీణావాదన ప్రవీణగాయకులును, గాయకయుక్త మృదంగ తాళాది లాస్య సంరంభ విజృంభమాణ రంభా సమాన వారకాంతలును, గాంతనిరంతర సురభికుసుమ ఫల భరితోద్యానంబులును, నుద్యానాంతర కనత్కమల కల్హార మరంద పాన తుందిల మిళింద ఝుంకార ప్రమోద మేదుర సారస హంస చక్రాది జలవిహంగకలిత సరస్సులును, సరసమనోహర పరిమళ మిళిత శీతల పవమానంబులునుంగలిగి, యమరావతీ విధంబున విబుధ గణ విభ్రాజమానంబై, తేజోవతీ నగరంబు చందంబున లోహి తాశ్వ విలసితంబై, సంయమనీ నగరంబు పోలుపున సమవర్తి ధర్మ రాజ విరాజితంబై, నైఋతినిలయంబుకైవడి పుణ్యజనోద్దీపితంబై, వరుణమందిరంబురీతి ఘనపుష్పమాలికా శోభితంబై, పవను గేహంబుభాతి నానా సుగంధ బంధురంబై, యలకాపురంబువలె ధననిధి మహితంబై, కైలాసంబులాగున రాజశేఖర రమ్యంబై, కమలగర్భసదనంబుపోలిక మహిత భాషా సమన్వితంబై, హ నివాసంబుచాడ్పున నిత్య ముక్తాభిగమ్యంబై, భోగవతీపుటభేదనం తీరున మహాభోగి భాసురంబై, వాహినీపతి తెఱంగున శరణాగ భూభృజ్జాతంబై, సాకేతరాజధాని వడువున రామ లక్ష్మణోప శో తంబై, ద్వారకయందంబునఁ గృష్ణ బలభద్ర ప్రకాశంబై, హస్తి వైఖరి గాంగేయాది పూజితంబై, యింద్రప్రస్థపురంబుమాడ్కి య గతధర్మజాతంబై, వారణాసిమాడ్కిఁ బ్రచండకాలభైరవ శూ హస్తరక్షితంబై సిరుల నిరవొందుచుండు.

క. అజగతి కధీశ్వరుఁడై,
రాజిలు మదనాభిరామ ♦ రాజేంద్రుఁడు జ

న్యాజితబాహోపనిధా,
రాజిత సముదోన్నతారి ♦ రాడ్గోత్తురింతై.

సీ. రమా లక్ష్మిమంది ♦ రమ్మ మేలమ్ముగా
గను సదాళిగుణమ్ముగా గ్రహించి
మధురధర్మముఁ బూని ♦ మాధవు లోఁగాని
యా లఘు ద్విజావళి ♦ నాదరించి
దాక్షిణ్యశాలి నోఁ ♦ ద్దన విల్పికొని కళా
నిధిపర్వమున రుచుల్ ♦ నిండఁజేసి
శోభితంబుగ మహా ♦ సుకృతిభావముఁ గాంచి
వరసత్యరతిమనో ♦ హరతమించి

తే. కలనయం దుగ్రమూర్తి సం ♦ కల్పమడఁచి,
ఘన సదృక్పాళికా పూన ♦ కర్తయగుచు
నతను విఖ్యాతిచే మద ♦ నాభిరాముఁ,
డలరు నిజనామగరిమ య ♦ థార్థముగను.

సీ. బిసములోపలఁజిక్కి ♦ వెడలువాని స్వయంభు
లాలిత వాణీ వి ♦ లాసుఁజేసె
నొంటివాఁడై దాన ♦ మొరుని వేఁడిన చిరం
తనహానిమేటి భూ ♦ ధవునిఁ జేసె
నచలాధివాసుని ♦ నాదిభిక్షుని సర్వ
మంగళలానుభవసం ♦ ప్రాప్తుఁజేసె
బహుళార్తిభేదవి ♦ భ్రాంతి గుందకళంకిఁ
దనతోడఁగూడ స ♦ త్పతిఁ జేసె

తే. నెన్న నీగుణ మీధర్మ ♦ మెందుఁగలదె,
తగ నయుక్తుల సరియుక్త ♦ లుగ నొనర్చు
నితని మదనాభిరామాఖ్య ♦ మిడిన నలువ
కౌశలంబు గణింప శ ♦ క్యంబె చూడ?

తే. రమ్యగుణశాలి యాభూపు • రండరుండు
దారగాఁగొని లీలమై • దారమాల
ననుదినముఁగూడి క్రీడల • నతిశయిల్లి
యవనిఁ బాలించె బుధనికా • యంబు వొగడ.

క. ఆయనఘున కుదయించె మ
హాయతగుణజాల బాల • యంచితలీలం
దోయజసాయకు నాఅవ
సాయక మన భూజనాళి • సన్నుతిసేయన్.

తే. చాయలనుఁ జెల్వమైన లేఁ • బ్రాయమునను
జనుల కల్లారుముద్దుగా • ననువుపడుచు
నాట పాటలు సలుపుచు • నవని బాల
యామినీపూర్ణతిలక స • మాఖ్య నలరు.

వ. ఆకుమారీరత్నంబు దినదినప్రవర్ధమానయై యున్నయెడ.

క. మృగమదమున రుచి బుట్టిన,
పగిదిని, జెఱకునను బండు • బండినరీతిన్
దగ సురభి పసిఁడి నొదవిన
పగటున, యౌవనము దనరు • బాలామణికిన్.

. మహిత యౌవనరూప • మధు మధురాలాప
బింబోష్ఠి శ్రీవర్ణ • బింబకర్ణ
కంజాతదళనేత్రి • కాంచన నిభగాత్రి
చతుర చంపకనాస•చారుహాస
పటుసైకతశ్రోణి • పల్లవాంచిత పాణి
ప్రౌఢ సౌభాగ్యసం • పన్న యోగ్య
కరికుంభ కుచపాళి • ఘన నీల రోమాళి
యబ్జారి కుం • దారదన

తే. యలరు మరుపంపుమొలక, కా ॥ యజుని చిలుక,
కలితకర్పూరతిలక, సు ॥ గంధఫలక,
యామినీపూర్ణతిలక నీ ॥ లాంచతలక
రాజసముగుల్క శృంగార ॥ రసముఁజిల్క.
సీ. నలినాక్షి కొప్పు కృ ॥ ష్ణత్వంబుఁ బొలిపించు
నెమ్మోము విభ్రరీతి ॥ నివ్వటిల్లు
నబ్జాస్యకన్ను ల ॥ బ్జాక్షత వహియించు
నధరంబు మాధవ ॥ ఖ్యాతి నమరు
నలివేణి చనుదోయి ॥ యచ్యుతత్వముఁగాంచుఁ
జెయ్యి పద్మాహిత ॥ స్థితి భజించుఁ
గరియాన నూగారు ॥ హరిలీల భరియించుఁ
గా ననంతవిభూతి ॥ గరిమఁదాల్చు
తే. నాభి పురుషోత్తమాకృతిఁ ॥ బొలిచవిల్లుఁ
దనువు హేమాంశుకస్ఫూర్తిఁ ॥ దనరు, నిట్లు-
భామ యవయవగతి నిష్ణు ॥ భావమొంది
వెలయుచుండు జనావళి ॥ వినుతసేయ.
వ. ఇట్లు తల్లిదండ్రులు కల్లారుముద్దుగా ముద్దియ యేపొద్దుఁ బొద్దులఁ బుచ్చు నవసరంబున.

—॥ విద్యాభ్యాసము ॥—

తే. అక్షరాభ్యాస మొనరింప ॥ ననువుపడుచు
స్వరయుతంబుగ వీణాది ॥ వాదనములు
చెలఁగు గీతప్రభోధవి ॥ శేషకలన
గాననైపుణి నేర్చె సం ॥ స్కారయుక్తి
సీ. రమణీయతరమైన ॥ రాయంచ మృదుచర
ణాబ్జ సంగతిన నా ॥ ట్యము లు సలుప

జెలువమై ముద్దులు • గులుకు పల్కులతోడఁ
బెంపుడు రాచిల్క • పేరుఁ గొనఁగ
రామాయణాది స • ద్గ్రంథముల్ వెలయఁగాఁ
బద్యపుస్తకరాజి • పరిఢవిల్లఁ
దాళకాలక్రియో • ద్ఘాతతంత్రిస్వర
భేదంబులను బాణి • వీణ మెఱయఁ

తే. జెలఁగు చిఱునవ్వు వెన్నెలల్ • చిలుకుచుండఁ
గలికి తెలిడాలు చూపులు • గలయఁబర్వ
బాండిమము దోఁచి భారతి • భాతి నాతి
పసిఁడిగద్దియపైఁ బాట • బాడుచుండె.

క. ఆపాట నవసుధాలహ
రీపటల మనోజ్ఞమాధు • రీలలితంబై
కోపై వీనులకాపై,
యాపైకరవంబుమాడ్కి • నాపైఁ దోఁచెన్.

వ. అట్టి సమయంబున,

క. మదనాభిరామభూపతి,
యొదవిన సంతోషమున మ • హోల్లాసముతోఁ
బొదలుచు గానము సేయఁగ
మదవతి నిజపుత్రిఁ జూచి • మదిఁజింతించెన్.

తే. ఈకులపవిత్రి సురుచిర • హేమగాత్రి
చంద్రికళగద సంగీత • జలధి కిపుడు,
దీనికిని సర్వవిద్యలుఁ • దేటపడఁగఁ,
బేర్చి సాహిత్య మొదవఁ జే • ప్పింతు ననుచు.

వ. నిశ్చయించి.

తే. కొలువుకూటంబునకు వచ్చి ◆ కువలయేశుఁ,
డమరసింహాసనాసీనుఁ ◆ డై ప్రధానుఁ
డగు వసంతాఖ్యు రావించి ◆ యధికసంభ్ర
మమున మన్నించి పలికె స ◆ మ్మతి దలిర్ప.

క. ఓమంత్రిశిఖామణి! యిదె,
నాముద్దుల కూర్మితనయ ◆ నయ మలరంగాఁ
గోమనగతి లయ పద్ధతు
లేమారక సరసగాన ◆ మింపుగ నేర్చెన్.

తే. గానవిద్యకుఁ దగినట్లు ◆ కన్య కిపుడు,
కావ్య నాటక ◆ సదలంకారభావ
సరససాహిత్య మేర్పడు ◆ సరణిఁ గఱపి,
ప్రౌఢ గావింపవలయు ని ◆ రూఢమతిని.

వ. అనుచున్న సమయంబున సభాసదులు తమలో నిట్లనుకొనిరి.

తే. కలికిపాలిండ్లు మేలిబం ◆ గారుగిండ్లు,
చానవాల్జూపు లాసుమ ◆ చాపుతూపు,
లతివవదనంబు సదనంబు ◆ యబ్ధిసుతకు,
కాంతముంగురు లమ్మధు ◆ కరుల కురులు.

ఉ. మో మఖిలంబుఁ గన్నుఁగవ ◆ మచ్చటమీఱఁగ వక్షమంతయున్
గామిడిచన్నుదోయి, కసు ◆ గాను సమస్తము మిన్న చూడఁగా
హేమము తత్తనూభవ ◆ మీరుచిరాంగికి విద్య చెప్పఁగా
నీమహి నెవ్వఁడోపు స్మరి ◆ యించినమాత్రనె భ్రాంతిపుట్టఁగన్.

వ. అనిన విని వసంతుండు భూకాంతున కిట్లనియె.

క. ఓరాజ! సకలశాస్త్రవి
శారదు లీపురమునందుఁ ◆ జాలఁగలా ర

వ్వారి నిటకు రావించి వి
చారింపఁగ వలయు విద్య ♦ చదివింపఁగన్.

చ. అనవిని సర్వశాస్త్రములయందు విశారదులైన యార్యులన్
ఘనమతిఁ బిల్వఁబంచి, నయ ♦ గౌరవము ల్పచరించి వారలన్
గనుఁగొని పల్కె భూవిభుఁడ ♦ నంతగుణోన్నతులార! మీరలుం
డినఫలమేమి? యొక్కటి ఘ ♦ టింపుఁడు మా కన, వార లత్తరిన్,

సీ. తర్కశాస్త్రములందుఁ ♦ దర్కలపనలయందు
భాషింపఁగను మహా ♦ భాష్యమందు
శబ్దశాస్త్రములందు ♦ సకలతత్వములందు
శ్రుత్యంతములయందు ♦ శ్రుతులయందుఁ
దత్పదక్రమజటాం ♦ తములఁ నారోహావ
రోహములఁ బురాణ ♦ రూఢియందు
స్మృతివిషయమ్ములఁ ♦ జెలఁగు మతగ్రంథ
ములయం దితరశాస్త్ర ♦ ములను మఱియు

తే. ఘనులమై వాదములు, ప్రసంగ ♦ ములు చేసి
గెలిచి యున్నట్టి మము ప్రసం ♦ గించి యెవఁడు
గెలుచు, మావంటివార లే ♦ కలను గలరు?
రాజ్యరఘుపతి, మదనాభి ♦ రామనృపతి!

చ. అన విని వారి కిట్లనియె ♦ నాత్మముదంబున భూమిపాలుఁ డో
ఘనమతులార! మీర లిటఁ ♦ గౌశల మేర్పడఁ గావ్యనాటకా
భినయ కవిత్వచాతురిత ♦ పెం పఖిలంబుఁ గనంగఁజేయుఁ డీ
మనసిజరాజపుత్రికిని ♦ మద్వరపుత్రికి మంజుగాత్రికిన్.

వ. అనిన విని యార్యవర్యు లారాజవర్యున కిట్లనిరి.

క. మేము రసజ్ఞుల మధిపా
శామయ్య! రసజ్ఞు లనఁగాఁ ♦ గవివర్యు లేక్షా

దా, మాకుఁ గవిత్వములే,
దీమహి ఛాందసులఁబొందు నేఁ యది తలపన్?

వ. అది యెట్లంటేని.

సీ. శబ్దాపశబ్దవి • చారి యైనట్టి వ్యా
కరణజ్ఞు జనకునిఁ • గాఁ దలంచు,
యుక్తివాదములచే • నొప్పారు తార్కికు
భ్రాతగా బుద్ధి నే • ర్పడఁ దలంచు,
చతురుఁడౌ మీమాంస • శాస్త్రపారీణునిఁ
గదియఁగ మందుఁడు • గాఁ దలంచు,
నొదిగి వైదికనిష్ఠ • నుండు నధ్యాపకుఁ
గనలి చండాలునిఁ • గాఁ దలంచు

తే. వివిధముగ నిట్టు లధిప! క • విత్వ కన్య
కావ్య నాటక లసదలం • కారభావ
నవరసాభిజ్ఞు మది నిజ • నాథునిఁగఁ
దలఁచి వరియించుఁ దనుఁదానె • వలపుమించి.

వ. అని పలికిన విబుధేంద్రులకు రాజమహేంద్రుం డిట్లనియె.

క. వర నాటక కావ్యజ్ఞుఁడు,
సరసుఁ, డలంకారవేది • ఛందోనిపుణుఁ,
డురుసాహిత్యకళానిధి,
యరయఁగ నెవ్వఁడు వచింపుఁ • డతనిం దెలియన్.

తే. అనిన మల్లాణ, బిల్హణు • లనఁగఁ గవులు,
సరసు లిరువు రలంకార • సహితు, లందు
బిల్హణుం డనువాఁడు గం • భీరుఁ డధిక
తముఁడు, కవిరాజనంగ స్తో • త్రములు వడసె.

—♦ బిల్హణకవిని వర్ణించుట ♦—

శా. ఆవాచాలత, యాకవిత్వసరసం, ♦ బాప్రౌఢి, యారూఢి, యా
భావం, బా పదశబ్దగౌరవము, లా ♦ పాండిత్య, మాశాస్త్రబో
ధావిర్భావక, మాసుధారసవచో ♦ వ్యాపార, మాపరిజ్ఞ యిం
దేవిద్వద్బులభేదికైనఁ గలదే ♦ యెంతేనిఁ జింతింపఁగన్?

సీ. ధరణి వస్త్రములలో ♦ ధవళాంబరము మేలు,
ఋతువులలో సుమా ♦ న్వితము మేలు,
సుమములలోఁ శిర ♦ శ్శోభి మల్లిక మేలు,
విలుకాండ్రలో రతి ♦ విభుఁడుమేలు,
ఘనసౌరభములలోఁ ♦ గస్తూరి మేలగుఁ,
గలయస్త్రములఁ గార్మ ♦ కంబు మేలు,
తనరు వాక్కులలోనఁ ♦ దర్కవాక్యము మేలు,
సారసముఖులలో ♦ శ్యామ మేలు,

తే. పరగు పదవులలో విష్ణు ♦ పదవి మేలు,
దశలయందున యౌవన ♦ దశయు మేలు,
మహితగీతులలోఁ బంచ ♦ మలయ మేలు,
కవులలో నెల్ల బిల్హణ ♦ కవియ మేలు.

చ. మృగములలోన సింహ, మవ ♦ నీందులలో రఘురామమూర్తి,
న్నగములలోన శేషుఁడు, వ♦నమ్ములలోపల నందనమ్ము, దే
వగణములోన శంకరుఁడు ♦ వార్ధులలోనఁ బయోబ్ధి యెట్లనో,
మిగులఁ గవీంద్రసంతతిని ♦ మేటియె బిల్హణుఁ డెట్లు చూచినన్.

వ. అనిన విని వారల బహూకరించి యథాస్థానంబుల కనిచి మంత్రవరు
నితో నిట్లనియె.

—♦రాజు బిల్హణకవిని బిలిపించుట♦—

ఉ. ఆకవిరాజరాజమణి ♦ నాదర మొప్పఁగఁ బిల్వఁబంపు మ
య్యా! కవితాచమత్కృతి వి ♦ హారముఁ జూతము, మత్కుమారి

స్తోకముగాఁ గవిత్వవిధిఁ • జొప్పడఁ జేయుద మంచుఁ బల్కఁగా,
నాకడ మంత్రి సజ్జనుల • నంచిన, వారటుఁబోయి యచ్చటన్.

సీ. ఒకచెంత వేదాంత • మూహించి ప్రకటించు,
నొకయెడ మన్మథసార • మొగి వచించు,
నొకచోట వరపాట • కకలాపము రచించు,
నొకచక్కి ఘనఫక్కి • కోర్కెఁ దెలుపు,
నొకమోర శృంగార • యుతకావ్యములఁ జూపు.
నొకసీమ నురుసామ • మూని పలుకు,
నొకదండ స్వరమండ • లకలగానముఁ జేర్చు,
నొకక్రేవ బహుభావ • యుక్తి నెఱపు,

తే. నొక్కతలమున మీమాంస • మొక్కదారి
వ్యాకరణపాఠ, మొకదెస • నలఘులక్ష
ణాద్యలంకారములఁ గోర్కు • లమర నొసఁగు,
నట్టిబిల్హణుఁగాంచిరి • హర్షమొదవ

వ. కాంచి, దండప్రణామంబు లాచరించి దీవనలు గైకొని సముచితా
సనంబులం గూర్చుండి కవిరాజశేఖరు నుద్దేశించి.

శా. దేవా! బిల్హణపండితేంద్ర! విను, మ • ర్థివ్రాతకల్పద్రుమో
ద్భావుం డామదనాభిరామనృపుఁ డ • త్యంతానురక్తిం బ్రతీ
క్షావాంఛన్ మిముఁ దోడితెమ్మనుచు నా • జ్ఞాపించె, విచ్చేయుఁడీ!
యీవేళం బనియించుఁ బల్కఁ,ననిమో • హేలాగతిన్ వారితోన్.

ఉ. ఏమి ప్రయోజనంబు? మము • నేటికిఁ బిల్వఁగ మిమ్ముఁ బంచె నా
భూమివిభుం డుదాత్తమతి? • భూరిగుణోన్నతులార! తెల్పుఁడీ!
మే మట కేగుదెంచెదము, • మీరన నేమిప్రయోజనంబొ, మా
కేమి మెఱుఁగవచ్చు? మహా • నీయులు పూజ్యులుగారె పండితుల్.

—◆ బిల్హణుండు రాజసభకు వెడలి వచ్చుట ◆—

వ. అని పల్కినఁ బ్రమోదాయమానాంతరంగుండై కవిపుంగవుం డమిత శిష్యసంఘంబుఁ గొలువ రాజమార్గంబున వచ్చునెడ.

ఉ. ఆముఖసత్కళావిభవ ◆ మాకనుబొమ్మ చంద, మావయో
ధామవిలాస, మానయన ◆ తామరసాతివిశాల దీర్ఘ రే
ఖామహితశ్రుతిద్వయ వి ◆ కస్వరకుండలదీప గండపా
ళీ మధురస్మితప్రభలు ◆ లేమలు సూచి రుదంచితోన్నతిన్.

తే. చూచి, తలయూఁచి, తత్తనూ ◆ రోచికాచి,
శ్రీమహిమకాత్మ మెచ్చిమెం ◆ తేనిసూన
బాణబాణవిభిన్న సం ◆ భ్రాంతచిత్తు
లగుచు నేకాంతమునఁ గాంత ◆ లతిశయమున.

ఉ. ఎవ్వఁడు వీఁడు, చక్కఁదన ◆ మే మన, నెన్నఁడుఁ జూడ, మెవ్వఁడో!
పువ్విలుకాఁడొ? యానసదు ◆ పుత్రుఁడొ? చంద్రుఁడొ? యాజయంతుడో!
యివ్వనితాశిరోమణుల ◆ హృద్వనముల్ చిగురింపఁజేయఁగా
జవ్వని! నేఁడు దెంచిన వ ◆ సంతుఁడొ చూడఁగ నాకు నాపుడున్.

మ. అతివా! పువ్విలుకాఁడనం బలికెదీ ◆ వబ్జాశుగం బెద్ది? యం
చితమౌ యిక్షుశరాసమెద్ది? ◆ మఱియుం జింతింప నవ్వారి ల
లక్షిత తత్తచ్ఛుభలాంఛనంబు లుపల ◆ క్షీభూతముల్ గావె నా
మతి నూహింపఁగ వచ్చెనో హరి తగన్ ◆ మానుష్యరూపంబునన్.

సీ. రాకాకళాశోభి ◆ రాజబింబమటంచు
వినుతిసేయఁగఁబోలు ◆ వీని మోము
పరితుష్యావవికసితా ◆ బ్జాతపత్త్రములంచు
నెన్నంగఁదగు వీని ◆ కన్నుదోయి

శ్రీకుమారుని హేమ • సింహాసనంబంచు
వీక్షింపఁగా నగు • వీనియురము
పోర్నిమితస్ఫుటో • ద్యత్తాహిపతి యంచుఁ
బలుకవచ్చును వీని • బాహుయుగము

తే. తుంటవిల్కాఁడు ముక్కంటి • కంటిమంట
నంటినను జెడి మును దమ్మి • కంటి కరుణ
మగుడఁ బుడమికి దిగివెనో • తగ నతండు,
సకియ! కాకున్నఁ గలదె యీ • చక్కఁదనము?

సీ. ఈపురుషోత్తము • నెద వసించిన పద్మ
కరభాగ్య మేమందు • కమలనయన?
యీచతురాస్యోక్తి • నెలమిఁ గాంచిన శుభ
వాణి పౌఢిమఁ జెప్ప• వశమె తరుణి?
యీమేటిసర్వజ్ఞు • నెనసియుండిన సతి
భూతి యింతింతనఁ• బొసఁగ దబల!
యీధామనిధిఁగూడి • యింపొందు సుచ్ఛాయ
పదవి యెంతని చూతుఁ • బద్మగంధి!

తే. వినవె, యీవనితానవ • మనసిజాతుఁ,
గూడి క్రీడించు తరుణుల • కోర్కులెల్ల
సఫల మగు, వీనిసంగతి • సలుపనట్టి
వెలఁదిజన్మంబు ధారుణి • వృథయకాదె.?

వ. అని యిట్లు వర్ణింపుచుండ బిల్హణుండు నిజాననసుధాకరప్రభాజాలమ్ములఁ దత్రత్యజనవిలోకనసందోహమ్ముల చకోరికాబృందమ్ములు గాఁగ మత్తేభఁబు చాడ్పున మందగమనంబున వచ్చి, విద్వజ్జనమంత్రిపురోహితాఖ్య త్యభృత్యవర్గంబుతోఁ దగు రాజేంద్రుని వలనఁ బ్రత్యుత్థానాభివం

దనంబులు గైకొని సముచితాసనంబున నధివసించి యాశీరాదపూర్వ
బుగా వేదవేదాంతాదిశాస్త్రంబు లుపన్యసించి, ఫలసహితంబుగా వ
తాక్షత లొసంగి మఱియును,

క. కవితాప్రసంగ మెంతయు
నవిరళముగఁ గొంత చేసి ♦ యచ్చట విద్వ
త్కవివరులచేత మెప్పులు
నవనీపతి హర్ష మొదవ ♦ నందెను వేడ్కన్.

క. గురుకవిభాషితయుతమై,
సురరాజసభాస్థలంబు ♦ చూడ్కిని దద్భూ
వరునిసభాస్థలి విబుధా
కరమై, పరమై, ప్రమోద ♦ కరమై యొప్పున్.

వ. అప్పుడు,

తే. రాజరాజైన మదనాభి ♦ రాముఁ డలరి,
తనదు కంఠస్థహారాళిఁ ♦ దగ నొసంగి
మఱియు మణిరుచిరాంబర ♦ మహితభూషఁ
ణావళు లొసంగి విడిదికి♦ ననిపెఁగవిని.

వ. అందు మితజనపరివృతుండై భూవరుండు మంత్రివరునితో నిట్లనె

చ. మఱఁడు తనూవిలాసమున, ♦ మంజుతరోక్తివిశేషయుక్తి చా
తురిమ గురుండు, సత్కళలఁ ♦ దోయజవైరి తలంప, వీనిఁ దా
మరసదళేక్షణ ల్గనిన ♦ మారశరాహతిఁ గ్రాఁగుచుందు రీ
వరకవియొద్ద మత్సుతకు ♦ వాంఛితవిద్య లభించు టెట్లొకో.

తే. వినుము, సుగతికి వరకల్ప ♦వృక్ష మిత్రఁడు,
వీనిలావణ్య మనియెడు ♦ విరులగుత్తిఁ
దనరు తారుణ్యవతుల చి ♦ త్తంబు లనెడు
మధుపములు రేఁచి తిగుచు స ♦ మ్మదతఁ దిర్న.

సీ. వీనిమనోహరా ◊ నూనభావముఁ గాంచి
మే నెఱుంగకపోవుఁ ◊ సూనశరుఁడు,
వీనిభాసురకళా ◊ విర్భూతిఁ గనుఁగొని
మిన్నందు నెపుడు త ◊ మీవిభుండు,
వీనిసౌందర్యాతి ◊ విభవంబుఁ బరికించి
యనిమిషగతిఁ జూచు ◊ హరిసుతుండు,
వీనిసౌభాగ్యశో ◊ భితవృత్తిఁ గని యుత్త
రాసఁ జెలంగు వి ◊ త్తేశసూనుఁ,
తే. డవుర! వీనికి దీటైన ◊ యతఁడు గలఁడె,
వసుధ వీక్షింప దేవతా ◊ వనితలైనఁ
దొడరి మూర్ఛానుగతిఁజెందు ◊ దురు, మనుష్య
కాంత లన నెంత యీతనిఁ ◊ గాంచినంత ?
వ. అని,
క. ఈవిధమునఁ బల్కి[illegible]
కా విబుధేంద్రుఁడు సుమంత్రి ◊ యసియెఁ, నృపవర్యా !
విద్యాభ్యాసము చెలి
కేవిధమునఁ బట్టుఁబడుఁగ ◊ వీంద్రుఁడు లేమిఁ ?
క. ఇతఁడు వినాఁగా నెవఁ డీ
క్షితితలమునఁ గవివరుండు ◊ సెప్పుమా? యనినన్,
మతిమంతుఁడ! యీవిధమున
కతిచతురోపాయ మొకటి ◊ యాత్మఁ దలఁపుమా.
వ. అని నృపాలుండు వల్కిన మంత్రి యిట్లనియె.
క. దేవరవారికిఁ దెలియని
దీవిశ్వమునందుఁ గలదె ◊ యిపు డట్టులైనన్

నే వచియించెద వినుమీ
దేవ! భవత్కరుణచేతఁ • దెలిసినయంతన్.

మ. ఒకచిత్రవ్రతమున్న దిర్వురకు రా • జోత్తంస! సిద్ధంబుగా
నకలంకాకృతి యైన సీతనయ జా • త్యంధు న్విలోకింప దా
సుకవీంద్రుండును గుష్ఠగాత్రి నెపుడుం • జూడన్ మదిం గోరఁ
దుకు నేమో వచియించుటే యెఱఁగి యుం • దు న్మన్ను దత్
ర్యమున్.

వ. అని మఱియు నిట్లనియె.

మ. కవిరాజాగ్రణి పుట్టుగ్రుడ్డనుచు నీ • కంజాక్షికిం జెప్పి, యా
కవికిన్ మీసుత కుష్ఠగాత్రి యని వే • డ్కం దెల్పి, యవ్వారిక
భువి నన్యోన్యవిలోకనక్రియలు నే • ర్పున్ మీఱఁ గాకుండున
ట్లు విచారించెద నొక్కయుక్తి వినుఁ డి • ట్లున్ రాజదేవర్షభ!

క. ఇరువురకు నడుమ నొక తెఱఁ
దిరముగఁ గట్టించి చదువు • దృఢతరమతిఁ జొ
ప్పరయఁగ మనకన్యక నే
మరకను జదివింతమయ్య • మనుజాధీశా!

వ. అనిన విని సంతోషితస్వాంతుండై భూకాంతుండు.

క. ఓమంత్రి! యెంతవాడవు,
నీమహిమ నుతింపఁ దరమె • నిర్మలగుణా! నీ
వేమంటె, వేమి చెప్పితి,
వామాటలయట్ల సేత • మది మేలుగదా.

వ. అని యంతఃపురంబుఁ బ్రవేశించి.

చ. జలరుహపాణి, వారిధర • చారుమనోహరవేణి, గాంచనో
జ్జ్వలరుచిగాత్రి, నీలజల • జాతదళాయతనేత్రి, నంతిక

స్థలమున నున్నదాని, సుమ • సాయకుమానినిఁ బోలు నాత్మజన్
నెలకొని కాంచి ముద్దుగొని • నెమ్మ దలిర్పఁగఁ దండ్రి యిట్లనున్.

— రాజు తనకుమార్తెతో బిల్హణుం డంధుండని చెప్పుట. —

క. నాగర్భజలధిరత్నమ!
నీగారాబంబుఁజూడ • నీకెప్పుడు నే
రాగంబున సాహిత్యము
బాగుగఁ జెప్పింతునమ్మ • ప్రౌఢిమ మెఱయన్.

క. సంగీతవారిధికి సా
రంగధ్వజరేఖ వగుచు • రాజితకవితా
సంగతి లేక చెలంగుట
భంగంబుగదా తలంప • భావములోనన్.

క. సంగీతవిద్య కెలమిన్
సంగతి సాహిత్యవిద్య • సరిగా రెండున్
మంగళవతి కలిగిన నా
సంగతిఁ జెప్పంగఁ దరమె • సంగీతనిధీ!

క. మనపట్టణమున విద్యా
భినయజ్ఞుఁడు గలఁ డొకండు • బిల్హణ సంజ్ఞుం
డనఁగను జాత్యంధుం డాం
తని చెంగటఁ జదువవలయుఁ • దత్పరమతివై.

వ. అనిన విని.

ఆ. అయ్య! నేను చూడ • నాకవియొద్దను
జదువు లెల్ల నెటులఁ • జదువుకొందు?
నంధకాననంబు • నాలోకనముసేయ
ననువ్రతంబు నాకు • జనక కలదు.

క. అంధకునిం, బాండురోగిని,
బాంధవదూషకుని, షండుఁ, బాపాత్ముని, దు
ర్గంధయుతుఁ, గుష్ఠుని వ,
సుంధర దర్శింపరాదు శుభగుణచరితా!

వ. అనినం గుమారికారత్నంబునకు జనకుం డిట్లనియె.

క. పట్టీ! యీలా గందురే?
యెల్లైనను విద్యనేర్పు టెంతో బాగా,
గట్టిగ వీరాయిరవుకను
గట్టించెదఁ గాండపటముఁ గనరాకుండన్.

వ. అని యొడంబఱచి, మఱునాఁడు సమయోచితకృత్యంబులు దీర్చి, కనకమణిమయ భూషణాంబర భూషితుండై కక్ష్యాంతరంబులు గడచి, యెసనెడఁ బుడమిజేజేలు దీవనలు గైకొనుచు, బహుదిననివసితదేశాధీశులమనవులు సముచితజనులవలన వినుచుఁ, గొందఱు సుందరులు సుందర చారులై కైవారంబులు సేయఁ, గొందఱు కంజాతపాణులు మంజులగతి వింజామరలు వీవఁ, గొందఱు కీరవాణులు చేవ్రాతలు గావింప నొక్కకర్పూరగంధి కపురంపుబాగా లొప్పు మిగుల నందియ్య, నందియలు మ్రోయ నొక్కమందయాన యందంబుగఁ జందనాదు లొసంగ, సంగతి నూడిగంపుఁజెలు లిట్లు సముచిత పరికారంబునఁ గొలిచి రా, మందగమనంబునవచ్చి వచ్చి, రాజీతక మలాకరంబు చందంబున నందంబగు రాజ్యలక్ష్మీ లక్షితంబైన యాస్థానమంటపంబుఁ జొచ్చి, సముచితకాంచనాంబుజమధ్యంబున నధివసించు రాజహంసంబు పోలుపునఁ గాంచనసింహాసనంబున మదనాభిరాజహంసంబు విబుధగణపరివృతుండై మహేంద్రుం డగుచు, సహా నక్షత్రసమన్వితుండై కువలయాధీశుం డగుచు, మహాభోగి పరివేష్టితుండై భూభృద్వ్రతంసుండగుచు, రాజకుమార సేవితుండై

రాజశేఖరుండగుచు, సముచితభాషాసమన్వితుండై చతురాననుం డగుచు సుమనఃప్రసన్నుండై పురుషోత్తముండగుచు, నభంగులైన వాహినీశులును, సపుణ్యజనబాధలైన సుమనోవల్లభులును, నవన శాలులైన ప్రచేతసులును, ననంతకులైన సమవర్తులును, ననుగ్రహ సహితులైన ధనాధిపతులును, నచంచలులైన మహాబలులునుఁ గొలువఁగొలువుడి మంత్రివరులతో నిట్లనియె.

తే. ఓవసంతరూప ◆ మహావసంతుఁ
డగు కళానిధిఁ బిలిపించు ◆ మూ, కళాధి
వాసిముఖి కొప్పఁ బలికితి ◆ వాసిమీఱ
ననఁగఁ బిలిపించెఁ గవివరు ◆ ననఘమతిని.

క. వచ్చినకవివరుఁ గనుగొని,
విచ్చేయుమటంచు నుచిత ◆ విధుల నరేంద్రుం
డచ్చుపడ సలిపి, కొన్నియు
ముచ్చటలుం గడపి కుతుక ◆ మున నిట్లనియెన్.

ఉ. ఓకవిరాజచంద్ర! విను ◆ మొక్కటిసెప్పెద, మత్కుమారిక
స్తోకకళావిశేషములు ◆ చొప్పడఁ జెప్పుము, లక్ష్యలక్షణ
శ్లోకకవిత్వరూఢి కవి ◆ లోకమున సన్నుతిసేయఁ దెల్పుమీ
మాకు గురూత్తముండవయి ◆ మత్కృత సత్కృతిగాంచి వేడుకన్.

—రాజు బ్రాహ్మణునితోఁ దనకుమార్తె కుష్ఠరోగి యని చెప్పుట—

తే. అయిన నొక్కటికలదు, మ ◆ దాత్మజాత
కుష్ఠరోగంబునను గొంత ◆ కొదవయయ్యె
వినయమందు మనీషావి ◆ వేకమందుఁ
గానమందుఁ బ్రవీణవి ◆ జ్ఞానహృదయ.

వ. అనినఁ గవిశేఖరుండిట్లనియె.

క. ఓహో! బాగాయెఁ గద,
యూహింపఁగ నెట్లు జెప్ప • నోపుదు విద్యా
వ్యూహంబు? కుష్ఠగాత్రిని
నాహా! వీక్షింపరాదు • హరివంశమణీ!

క. వ్రతి మొకటికలదు మాకిల,
శ్రుతిహీనునిఁ, గుష్ఠరోగిఁ • జూడనటంచున్,
మతి సంశయింపనేటికి,
ధృతమతి మముఁ బంపుమయ్య • ధీరవిచారా!

వ. అనిన విని రాజేంద్రుం డిట్లనియె.

క. దానికి నొక్కటిచెప్పెదఁ,
గానిమొదల్ నడుమ పటముఁ • గట్టించెద స
న్మానముఁ గైకొని విద్యా
దానము సేయంగవలయు • దాక్షిణ్యనిధీ!

ఉ. అందుకు బిల్హణుండు విన • యంబు, నయంబు మనంబు నొంద రా
జేంద్రునిఁజూచి పల్కె. వసు • ధేశ్వర! మీమన సట్లు యుండఁగా
నిందుల కేమియందు? భవ • దీయవచోగతి మీఱరాదు, మే
లొందఁగ దోఁచినట్ల సతి • కొప్పుగఁ జెప్పెద విద్య నేర్పఁగన్.

వ. అనిన విని సద్గ్రంధకుసుమతాంబూలాది ప్రదానంబుల సంతుష్టుఁ
గావించిపుచ్చి, దరహాసితవదనుండై యిష్టసఖునితో నిట్లనియె.

తే నీయుపాయము బాగాయె • నీతివేది!
వనుచు భూషించి తత్క్షణం • బున నిమిత్త
కోవిదులఁ బిల్వఁబంచి య • క్కవలయేశుఁ
డనియె శుభలగ్నమీక్షింపుఁ • డనుచు ప్రీతి.

వ. ఇట్లు ముహూర్తనిర్ణయంబుఁ జేసి, గృహకారుల రావించి, వివిధచిత్రంబులుగా విద్యాశాల రచియింపఁజేసి.

## —విద్యారంభము—

తే. అపుడు మదనాభిరామ నృ • పాగ్రగణ్యుఁ
డతులమైనట్టి శుభదిన • మందు హితుల,
బాంధవుల, మంత్రిహితులను • బండితులను,
గవుల రావించి బిల్హణ • కవినిఁ బిలిచి.

క. తనకూర్మి తనయ నధిపతి
రావింప వెంటఁ దవిలి సదాళుల్
గని యా మోదమునను రా,
సదనంబునఁ జేరి పటము • చాటున నిలిచెన్.

వ. అప్పుడు పురోహితులు పుణ్యాహవాచనంబు లాచరించియున్న తదనంతరంబు.

తే. మొదల విఘ్నేశ్వరుని, వాణిఁ • బూజచేసి
బాలరామాయణమును • బద్య మొకటి
యర్థయుక్తత నారంభ • మర్థిఁగలిపి
ప్రేమఁ జెప్పఁగఁ దొడఁగె నా • బిల్హణుండు.

వ. అప్పు డప్పుడమిఱేఁడు సమస్తవిద్వజ్జనభూసురాది బాంధవులకు భోజనంబులు గావించి మణిమయభూషణవస్త్ర మాల్యాది లేపనతాంబూలాది కృత్యంబులం బరితృప్తులంజేసి మఱియును,

మ. జననాథాగ్రణి, పుత్రికిం గవికి ని • ష్టం బొప్పఁగా నిత్యభో
జన తాంబూలము లంచితాంబరములున్ • శయ్యాసనస్రక్సులే
పనముల్ తక్కువగాకయుండ నమరిం • పన్ సాగె బిల్హణుం డవ్వధూ
మణికిం గావ్యము లాదిసేసి కరపిం • పన్ సాగె నానాఁటికిన్.

క. సరసాలంకార మనో
హరకావ్యము లర్థయుక్తి • మైఁ జెలువొప్పం
బరగ సుశబ్దవిచారము
వరసాహిత్యంబుఁ దేట • పడఁగాఁ దెల్పెన్.

తే. జగతిజనములు మెచ్చి యా • శ్చర్యమొంద,
లలితముగ బిల్హణాఖ్యుఁ • డలన సకల
విద్యలు గ్రహించి జలధర • వేణి యొప్పె
నంబు ద్రిమింగిన తప్తలో • హాంబుకరణి.

సీ. వివిధభావవిశేష • నవరసంబులయందుఁ,
రీతి నలంకార • భేదములను,
ఛందోవిభేద ల • క్షణవృత్తనాట
కప్రక్రియల మహా • కావ్యములను,
కామప్రదములగు • కామశాస్త్రములందు,
జ్యోతిషశాస్త్ర సం • గీతశాస్త్ర
ముల, నభినయకళా • కలితమార్గములందు,
గణితతత్త్వామర • కాండములను,
తే. బోధమైమించి శ్లోకార్థ • భావ మెఱిఁగి,
సంస్కృతాఖ్యైక భాషాది • చతురయగుచు
హితము మీఱఁ గవిత్వ మూ • హింపఁదొడఁగు
యామినీపూర్ణతిలక వా • గతిశయమున.

—• చక్రబంధము •—

శా. ధన్యాసింహాభ చంద్రకీర్తి వరవి • ద్యాపణ్డితార్యక్రమా
గణ్యాగర్వి ధనంజయాఖ్య పదము • క్తాకల్పసంకప్రభా

జన్యారాజితభూరిశాత్రవసుభృ జ్ఞాతిద్రమావిక్రమా
మాన్యారాధన త్యాగ భోగ జుషా ◆ మా నవ్యభాగ్యోత్తమా.

మాలిని. కాండ భూభవాసితాంశు ◆ కాండ భూభవాదరా
ట్కాండ భూభవాబ్జసుప్రి ◆ కాండ కాండ భూమరు
త్కాండ భూధవాపగోర్మి ◆ కాండ తుండిరాట్సునా
కాండ పాండుభావిభాస్య ◆ ఖండకీర్తిమండలా.

ఇది ప్రథమాశ్వాసము.





శ్రీరస్తు.

# బిల్హణీయము.



## ద్వితీయాశ్వాసము.



శ్రీ మానిత వర రఘుకుల
సోమా! సోమాంతరంగ ♦ సురుచిరభవనో
ద్దామ! విలాసయశోవర
సీమా! మహనీయనామ ♦ సీతారామా!

వ. అవధరింపుము. తదనంతరంబ,

— ♦ వసంతకాలాభివర్ణనము ♦ —

చ. అలరె వసంతకాలము పు ♦ రాంతికసీమ వనాంతపుష్పసం
కలితమరందపానభర ♦ కల్పితమత్తమధువ్రతాంకసా
కలమృదుగానలోల మతి ♦ కాంతరసాలవిశాలపల్లవో
జ్జ్వలపికనాదసంచలిత ♦ చారువియుక్త జనానుఖేలమై.

చ. అల మధుమాసవేళ జల ♦ జాయతనేత్రలు క్రీడ సల్పుచోఁ
గొలఁకులపజ్జఁజేరి నవ ♦ కోమలకాంచనపుష్పజాలముల్
హలహలికన్ గ్రహింపఁగ స ♦ దాళులు నీ! యనిరోసి వేగ భూ
తలమునఁ గాంచనాపహృతిఁ ♦ దల్పరుగా సుమనఃప్రవర్తనల్.

చ. చెలఁగు వసంతభూరమణ ♦ శేఖరుఁ డోలి మహావనిస్థలిన్
గ్గలయఁగ నేల పైఠ మెన ♦ గంధగఁ గైకొని మఃద్రఁ బెట్టుచో

వలనుగ హేమరాశి మధు ♦ పాయికిఁ జూపక వైరిజాతులన్
మలఁగుపరించు మిత్రు వసు ♦ మంతునిఁగా నొనరించె నాథ్యుఁడై.

మ. కమలామోదము సంఘటించి శుక వా ♦ క్యం బర్థి నాలించి, యా
సుమనః కాండములెల్ల బోధముఁ గనన్ ♦ శోభిల్లఁగాఁజేసి ని
త్యమహీభూతిఁ బలాశభేదనకళా ♦ వ్యాపారియై మాధవుం
డు మహిం గౌరవజాతి నే పడఁచి యుం ♦ డున్ సద్విజుల్ మెచ్చఁగన్.

చ. మనసిజచోరకుండు తరి ♦ మాటున మ్రాఁజిగురాకుబాకు చే
కొని మెయి డాచి వేగఁ దమిఁ ♦ గొల్చి శశిం బయిఁ గాఁపువెట్టి తా
నెనయఁగ ధైర్యభిత్తిఁ జెక ♦ లించి సమీరపుమచ్చుఁ జల్లి చ
య్యన హరియించిమించెఁ బ్రిమ ♦ దాంచితమానధనంబు లెంతయున్.

చ. మరుఁ డనుసోమయాజి వన ♦ మధ్యమునందు ద్విజాళిమంత్రముల్
కరముఁ బఠింపఁగా శిఖిప్ర ♦ కాశిలఁ గాంచి మరుద్గణంబుల
న్వరుస భజించి రాజున క ♦ వార్యశుభోన్నతిఁ జెందఁజేసె నా
పరమమతిన్ వియుక్తవశు ♦ బంధము మాధవుఁ బ్రీతిసేయుచున్.

సీ. మాకందములనీడ ♦ మాకందములు చూడఁ
జేకొమ్మ యోకొమ్మ ♦ చిగురుఁ గొమ్మ,
గోరంట డాయవే ♦ గోరంట రాయవే
యీచాయ యేచాయ ♦ నింపుఁజేయ,
తిలకంబు మానినీ ♦ తిలకంబు బూని నీ
చెయ్యేన నియ్యాన ♦ చెలఁగునాన,
పున్నాగములక్రిందఁ ♦ బున్నాగములఁ జెంద
నాసొంపు రతిపెంపు ♦ నందగింపు,

తే. నిట్లు ప్రమదలు సఖులతో ♦ నెనసి మనసి
జాతదీపితహృదయలై ♦ సంతసమున,

సరసవనకేళి కామమహో ♦ త్సవము లలర
వెలయుచుందురు మధుమాన ♦ వేళలందు.

సీ. ఘనరసాలంబుఁ బైగె ♦ కొనియెఁ గోకిలవాణి
పదరి పోఁబోకువే ♦ పల్లవోష్ఠి,
యనుపమసరసిఁ దా ♦ నాఁగెఁ జక్రస్తని
మేలని కదియకే ♦ మీననేత్రి,
చిగురించు బలుగొమ్మఁ ♦ జెందెఁ గుంజరయాన
చేరఁ జూడకవె రం ♦ భోరుయుగళి,
కదలికాతరువందెఁ ♦ గర్పూరవరగంధి
కూడవే లివకుచవ ♦ క్షోజకుంభ,

తే. యనుచు నొకఁకోటి యదలింప ♦ నతివగొనక,
రామలార! చంద్రాస్యలార! ♦ హరిమధ్య
లార! సురభిళనిశ్వాస ♦ లార! పలుకు
మానుతపియించు దిగులొందు ♦ మాయు ననియు.

సీ. బింబోష్ఠి చిలుకలఁ ♦ బిలిచి ముద్దాడంగ
సాంకవగంధి మె ♦ చ్చకను గదిరె,
జలరుహచరణ హం ♦ సల గారవింపంగ
ఘనవేణి రొప్పుచుఁ ♦ గడకునొత్తెఁ,
గుసుమాంగి యళులఁజే ♦ కొని తేనె లియ్యంగఁ
గాంచననాస త ♦ ప్పించి తరిమెఁ,
గిసలయపాణి కో ♦ కిలములఁ బలికింప
రామాభిరామ యూ ♦ రకయె ననిపెఁ,

తే. బలుకులను యానములల ముంగు ♦ రులను గీత
ములను లేదోఁట నిరయుచు ♦ వెల్వదు ల్బ్లు

మరునిబలములఁ గొందఱు ౹ మరులు గొలుపఁ
గొంద ఱవిజూచి నిరసింతు ౹ రందమలర.

వ. మఱియును,

సీ. కలికి చిల్కలకొల్కి! ౹ ఫలములుఁ గోయవే,
కోకిలవాణి! చి ౹ గుళ్ళుదేవె,
దీటుగా నలివేణి ౹ తేనియల్ కూర్పవే
పావనచరిత! పు ౹ ష్పములుదేవె,
కలహంసగమన! మేల్ ౹ జలము లానించవే,
చంద్రాననన! సుధార ౹ సంబుఁదేవె,
పాటలాధర! వేగ ౹ వీటి ఘటింపవే,
భర్మోపమాంగి! దీ ౹ పంబుఁదేవె,

తే. యనుచుఁ దమలోన జెలులు స ౹ య్యాటములను
సరసవనకేళికామహో ౹ త్సవము మెఱసి
యసమశరదేవుఁ బూజింతు ౹ రంద మలర
సారమధువేళఁ గాసార ౹ తీరములను.

తే. ప్రకటితాగమవాసనా ౹ ప్రథితములయి,
విమలకాసారగౌరవ ౹ విభవమంది
లలితమైన వసంత కా ౹ లమునఁ గాన
నములు చెలువొందు నాకాన ౹ నముల కరణి.

మ. సకియా! కొమ్మలు పల్లవాళులతో ౹ సయ్యాటముల్ సల్పి హా
లికుచంబుల్ ఫలసంగతిన్ వెలయ నా ౹ లీలాగతుల్ గంటి వే
సకియా! కొమ్మలు పల్లవాళులతో ౹ సయ్యాటముల్ సల్ప హా
లికుంచంబుల్ ఫలసంగతిన్ వెలయుటల్ ౹ చిత్రింబె యూహింపఁగన్.

ఉ. రాగముతో సదాళి తన ♦ రం బొదిసేయఁగ నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమ ♦ నస్థితి నున్నది చూడు మన్న! హా,
రాగముతో సదాళి తన ♦ రం బొదిసేయఁగ నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమ ♦ నస్థితి నుండుట చిత్రమె చెలీ!

సీ. చిగురాకు లవియేలఁ ♦ జీల్చెదరే? వన
ప్రియచయాశాప్తి హ ♦ రింపరాదు
బిసకాండనుల నేల ♦ విరిచెదరే? హంస
జీవనచ్ఛేదంబుఁ ♦ జేయరాదు
మకరందములనేల ♦ మాపెదరే? సదా
ళినిరాకరణవృత్తిఁ ♦ బెనుపరాదు
కువలయంబుల నేలఁ ♦ గూల్చెదరే? ద్విజ
రాజసంప్రీతి నా ♦ ర్పంగరాద

తే. టంచుఁ గొందఱు సుందరు ♦ లంద మలర,
సరసులఁ గ్రీడించు ♦ చనుదినంబు
సరసవాక్ప్రౌఢిఁ జూపుచుఁ ♦ జతుర లగుచు,
వెలయుచుందురు మధుమాస ♦ వేళలందు.

వ. మఱియు నవ్వసంతసమయంబునం గొంత లింతింతనరాని వసంతసంబున సంతత తంతన్యమానతరుసంతానవితాంతకాంతంబు లగు లతాంతంబు లనిరంతర పరిమిళవంతంబులగుట బంతులుగొను తేఁటుల రంతులకు నలంతఁగొను చింతల నత్యంత సుమరస దంతురాంతరంబు లగు కసవనాంతరంబుల కరిగి తదంతరంబుల వంతులుమీఱ సేమంతులు గోయుచుఁ బూబంతులుఁ గట్టుచు నెంతయు వింతలగు గంతులు చికిలికంతంబు లన మంతు కెక్కిన శశికాంతరుచుల వింతఁగొను దొంతరలగు గలికాసంతతుల కాంతిమంతంబులై ప్రాంతంబుల నలతి

వాసంతికా దంత నిశాంతంబు మంతనంబులు మెఱయ రతికాంత విజయోదంతంబులను పంతంబునాడుచుఁ గొంతతడవుతోడ నింతులఁ గికురింపుచు, నిగనిగని పగడములవగఁ జెగడు నొగరు తొగరు పొగరు చిగురులఁ గోకనదముల కెగరు వగఁగొను మగకోయిలల తెగ తెగ లగు నెగు లెగయ నగపడక బుగులు బుగులుకొన మొగ ముల సొగసు చిఱునగవులఁదగవగునే యూపుచుఁ దగుల మిగుల నొగిలి సగమగుచుఁ బులుగులుకు సరిగనుపడ మగుడి సరిగపని జిలుగు సగరపు రయికలు బిగిబగుల నిగుడి పొంకంబులగు బింకంపుఁ జన్నుల నెలవంకల నింకకనువెడలు నకలంకలోహితాంకురంబు లగు సంచిత సంకుమదకుంకుమ పంకంబులు జార పంకజరసంబులు దొలం గుకొలంకుల తేనియవంకల నిరువంకలు నలంకరించులంకెలగు కంకేళీ వనాంగణ విటంకంబుల మీనాంకధనుష్టంకార శంకాకంబులై సుంకెడలీన గొరవంక పల్కులకుఁ గొంకుచు జంకెలజంకెలువైచు జంకెనచూపు లకలంకరత్నాంకిత తాటంకరుచుల వంకలుఁ గొను కింకరీజనసంఘాతంబులవంకలఁ దలఁకక నిల్చుచు నందంద యరవింద గంధతుందిలమందిదానిలసందోహంబులు కందళితకుందచందన మందార బృందాన్వితంబులై కురువిందమణి సందీపితంబులగు కొండలిరుకావి చందవుల నొంది మకరందబిందుబృందంబుల పొందునఁ జిందు నందం పుఁగురువిందపందిరులయందు నానందించు నిందిందిర సందోహంబులు సందడి లేచి గ్రిందుకొన ఱెందంబులు కొందలపడ నిందిరకుమంది రంబు లగు కొందమ్మిలకుం దావులపందెమ్ములు జరుచుచు నందరు పిరుందులడ్డిందఁ గొందరు ముందర నరిగి యిందీవర మిళి న్మిలింద ముఖరితాళిందమ్మలకుఁ గందర్పనిజమాకంద మ్మలక్రిందఁబిఱుందులు చలింప నందియలు మొఱయఁ గుందనంపు నంది బొందియలు చందోయిలొరయఁ జిందులుఁ ద్రొక్కుచుఁ గందుక కేళిం దేలుచు నిల్లు విహరింపుచుండ ఫలపరిపాక సౌభాగ్యసంపన్న శుకసంభాష ణంబై భాగవతంబుఁ గరణి, వసుమతీజాతాభిరామంబై, రామాయ

గంబుఁ బగిది, నారూఢహరికుమార బాణాసనంబై భారతం
వైఖరి, నామోదితసుమనోవికాసంబై, ఇంద్రనగరంబు భాగున స్నేహ
భూతగంధవాహంబై ధనంజయు నివాసంబుఁబోలికఁ, జకాంగపా
కాసరస్ఫురితంబై దండధరునిలయంబు భాతి, శోణోపరాగపలా
దీప్తంబై నైఋతినిశాంతంబు చందంబున నగతరువిలసితంబై
వరుణమందిరంబురీతి, సముదితగంధబంధురంబై రాజరాజనికేతనం
చాడ్పునఁ, గందళిత మహాకోణాభిశోభితంబై పవనునిభవనం
కై వడి, విలసితకుందంబై కైలాసంబుతీరున, జాతిరహితంబై యజ్ఞ
దనబ్రహ్మంబు చెలువున, నిఖిలద్విజసూక్తిగాంభీర్యంబై మాధవ
యందంబున శుకపికవనప్రియచయంబులకు నిష్టఫలంబు లొసంగుచు
సకలవిధకుసుమాకరంబై, కుసుమాకరంబొప్పుచున్న సమయంబున.

## — సూర్యాస్తమయ వర్ణన —

సీ. కరినాథుఁ బట్టు న • క్రంబుపై విడిచిన
సరసిజాక్షుని చేతి • చక్రమనఁగ
నరుణదిక్సుదతికి • వాసవుం డనురక్తిఁ
బంపినకెంపు పూ • బంతి యనఁగ
నపరశైలాంతహ • ర్మ్యస్ఫటికజాలాంతరా
ర్పిత మహాదర్పణ • బింబమనఁగ
భువనాధిపతి ని • జపురమున బిరుదుగా
వల నొప్ప నెత్తిన • ధ్వజ మనంగ

తే. నభ్రసుందరి సుగుణర • త్నాకరునకు
మేలుగలుగంగఁ బలురత • నాలు గూర్చి
పట్టి త్రిప్పెడి యారతి • పళ్ళెమనఁగ,
గమలమిత్రుఁడు చరమభా • గమునఁనొప్పె.

మ. ఎనయన్ సర్పతి యంతరిక్షమునను ♦ డేతెంచి యేమెంచునో
యను శంకం గడుభీతిచే ఖరకరుం ♦ డబ్ధిం బ్రవేశించెనో
యన నస్తాలయ వాటికిం జనియె ను ♦ ష్ణాంశుండు తత్పీడ యొ
య్యనఁ దప్పెంగద యు చు నక్కవలయం ♦ బానందముం జెందగన్.

ఉ. వారణదిగ్వధూటి నిజ ♦ వాటికిఁ బ్రేమ నినుండు రాఁగఁ దా
భూరిముదంబునం బొదలి ♦ భూరిమణీగణభూషణాళి కెం
పారెడుపట్టుచీరె మెయి ♦ నందఁ ధరించి కుచద్వయంబునన్
గూరిమిఁ గుంకుమం బలఁదె♦నో యన సాంధ్యముదోఁచె నయ్యెడన్.

క. ఇనుఁడరిగె ననుచు సమయాం
గన నీలపటంబుఁ దాల్చెఁ ♦ గలయాశల మే
కొనియెడు జారిణి కైవడి
నసఁ జీఁకటి పుడమిఁ జెలఁగె ♦ నతిబహుళంబై.

చ. అపరవధూటికామణికి ♦ నై యతి మోహముఁ జెంది రాజు చొ
క్కపు సిరిగల్గు మంత్రఘుటి ♦ కాతతి విచ్చినపూలుఁ గొన్ని యం
దపుఁ గపురంపుఁబూసలు ప్ర ♦ దంబున వశ్యముగాఁగఁ బంచె నా
నపుడు సరోజజాండమున ♦ నంతట బారులుదీరెఁ దారకల్.

చ. మరుఁ డను భూమిపాలునకు ♦ మాపటివేళల దిక్పురంధ్రులున్
విరు లను లాజలుంగలిపి ♦ వేడుక సేసలు జల్లిరో యనన్
సరవి నభఃప్రదేశ మను ♦ సౌధమునం దొనరించు దివ్యహం
దరతరవజ్రపాళిక ల ♦ నందగెఁ జుక్కలు పిక్కటిల్లఁగన్.

## —♦ చంద్రోదయాభివర్ణనము. ♦—

మ. కుముదంబుల్ వికసింపఁ, గోకములు సం ♦ కోచింపఁ, గామిప్రజా
ళివసంబుల్ దలకింప, నల్ [illegible] ♦ [illegible] రాణింప, న

కకమలంబుల్ ముకుళింప, వెన్నెలలు వే ♦ డ్కన్ మింటసూచింప,
దమసంబుల్ సడలింపఁ, జిత్తినుల చి ♦ త్తంబుల్ విజృంభింపఁగన్.

చ. తొలిదెస కెంపునొంద, నయ ♦ తుల్ భయమందఁ, బయోధి పొంగఁ,
మ్ములు ముగుడంగఁ, గల్వలు ప్ర ♦ మోదము నింపఁ, గవ ల్చలింపమి
న్వెలయఁ, దమిస్రిముం బొలఁయు ♦ వెన్నెలపుల్గులుఁ జేర, మారుఁ డ
గ్గల మయి మీఱఁ, జందురుఁడు ♦ కాంతులఁ జల్లుచుఁ దోఁచె నెం
తయున్.

తే. మదనుఁ డిగురాకుఁదూపులు ♦ పదనువెట్టు
కళలఁదేరెడు శాణచ ♦ క్రిం బనంగఁ
దామసీసతి కర్ణావ ♦ తంస మనఁగ,
నుదయగిరిఁ జంద్రమండలం ♦ బుదితమయ్యె.

—♦ యామినీపూర్ణతిలక యుద్యానంబున విహరించుట ♦—

వ. ఆసమయంబున యామినీపూర్ణతిలక యసుగత సదాళీతిలయై ప్రొద్దువోక నిదురరాక లేచి నల్దెసలం జూచి దండ నుండు నొక్క వేదండయానపైఁ గై దండయిడి మందగమనంబున బృందారక సుందరీసందోహము నడుమఁ గదునెడ్వై నందనవనమునకుం దరలు పురందరారవిందవదన చందంబున నందంబై యుద్యానవన సమీక్షణోద్యోగయై చని చని యచ్చట నచ్చపుఁ బచ్చరాల మెచ్చుగుఁ దిన్నెల వన్నెవాడలు గడలుకొనఁ జివురుజొంపంబుల సొంపొంగిన మాకందంబుల క్రిందఁ గొంతసేపు విశ్రమించి తదాశ్రితవనితాజనతార్చిత ఫలకుసుమాద్యుపచారంబుల హర్షంబునొంది యవ్వల జని జవ్వనులం బిలుచుచు నవ్వనిఁ గలయం దిరుగుచు మంజులతరకుంజంబు లరయుచు నంబుయంత్రింబుల్లుఁ జూచుచు పాదులు గట్టి బోదులు చేసిన

మల్లికావల్లికాదుల నవలోకింపుచు నింపులు మెఱయ సంపెంగలు గోయుచు సొంపుసంపాదింప సాలంబుల లోలంబు లగు శాఖాజాలంబుల సయ్యాటంబుల నొయ్య నొయ్యన నుయ్యాల లూఁగుచు బాగు మీఱిన నికటతటినీతట నివసిత సికతాతలంబునఁ గప్పురగంధుల తోడ నొప్పుగఁ గప్పురంపుఁదిల మొగమ్ములఁ గప్పి వెన్నెలకుప్ప లాడుచుఁ దప్పినఁ జప్పటు లప్పళింపుచు నొకరి కొకరిం గికురింపుచు నాటలఁ బాటలఁ బూఁదోఁటల నిట్లు విహరింపుచు.

౪. అలివేణిరో! మన కామోదంబులుఁ, గలయఁగఁ జేయుచుఁగల నాదంబులు పెంపుఁదలిర్పఁగఁ బికవారంబులు, గుంపులుగొని పల్కుచుఁ గీరంబులు జాలరు తేఁటుల ఝుంకారంబులు, నోలిగ శారీహుంకారంబులు పరఁగఁగ నొప్పెడు పాటీరంబులు, మెఱయుచునుండెడు మేటీరంబులు నడరు నెపుడుఁ గుసుమాసారంబులు, గడువడి బోసరె కాసారంబులు గలిగినచోటికి: గదలెడితావులు, గలిగినఁజాలును గపురపుదీవులు చూడరె యెంతో సొంపై యున్నది, పోడిమి జెప్పను పూర్వమె కన్నది కంటే తక్కవగలదా వాటికి, యంటివె పోదము యావనవాటికి పదవే పోదము పదుగుర మిప్పుడు, వదరక పోవలె బలుకాల్ చప్పుడు వినినఁ బెగడిపోవే రాయంచలు, పనివడి నేర్పేర్పడఁగాఁ జంచులు చాటుఁజేసికొని చనరే యింతులు, మాటలాడకువె మఱి మీరంతులు మొక్కడవచ్చిన నేమన వీరలు, వెక్కసమాడితివే సఖి వారలు సేయఁగ నన్ననఁ జెలువే నీకును, పోయెదనుండవె పొలతిరొ నాకును పని యేమున్నది పలుకే మంచిది, మనలేదా నీమాటలసంచిది తేటగమన మీ తేనియవంకలు, దాఁటఁగఁ దరమే తలపున శంకలు మానరె చూచిన మంచిది వెన్నెల, కానికాని మఱి కపురపుఁదిన్నెల తరువులనీడల దా.గిలిమూఁతలు, పరగ నాడుదము పదుగురు నాతులు

రారే నేనీరమణిని ముట్టితిఁ, గోరికమీఱఁగఁ గొమ్మను బట్టితి
బంతులాడదము వంతులుగట్టుక, చెంతకు రమ్మా చెలిఁ జేపట్టుక
పువ్వులఁగోయుద మివ్వనితావుల, దవ్వాపోదము తనరెడుతావుల
కిమ్మైయుండిన విదిగో పువ్వులు, నీమహిరాలిన నేరవె పువ్వులు
గాడిగ వెన్నెలగాయఁగఁ దరువుల, నీడలపొడ విన్నెల వీయిరువుల
నేతెంతము మఱి యిందరు వేడుక, నావతకేళుల నందరు గూడుక
నాడుచుఁ బాడుచు ననుగతవనమున, వేడుకచేసిరి వెలఁదులు ఘనమున.

క. అం దలసి సొలసి రాజపు
రందరకన్యాలలామ • రమణులు వేడ్కం
జెంది యుపచారములు సే
యం దగ శయనించె సుమకృ • తాంచితశయ్యన్.

తే. అట్లు శయనించి కూరుకు • నంది యంద
నంతలో లేచి వివశాత్మ • యై కలంగి
తెలిసి, కనుమూసి, కన్విప్పి • దెలివిఁగాంచి,
కాంచి దిక్కులచెలులను • గాంచి కాంచి.

తే. మగుడి శయనించి, మఱిలేచి • మయి విదిర్చి,
మదిఁ దలపోసి తలపోసి • మరునిగాసి
కిని భరింపఁగలేక మా • ర్పెనయఁజిక్కి
పల్కనేరకయున్న న • ప్పడఁతులెల్ల.

క. ఇది యేమివింత యిచ్చట
నిదురించెను లేచి? లేచి నెఱిమనమునఁ
జూడదు మాటలాడ దెంతయు,
నిదియేమో తెలియనేర • మేమంద మిటన్?

వ. అని యిట్లు తమలోఁ దాము వితర్కించి చుట్టుముట్టి శాపట్టి నిట్టు
బట్టి యుల్లె—ని మొగంబుఁ గన్గొని ...ఘనముల యిట్లనియె.

క. ఓయమ్మ! యేమి యిది నీ
కీయెడ మనముఁ జూచి పల్క వేమే? యిపుడున్
డాయవు కారణ మేమిా?
పాయని దయతోడఁ జూచి పల్కుము కలికీ!

చ. అన విని చాల తెప్పిరిలి యాసఖి గన్గొని పల్కె నోసఖీ!
విను మొకవింత, యేమని భువిన్ వచియించెద? నైనఁ జెప్పెదన్
పని జరియించి యిచ్చటికి వచ్చి ముదంబునఁ బువ్వుసెజ్జ నిం
పున శయనించి యుండుతఱిఁ బొందుగఁ గూర్కిడినంతలోపలన్.

చ. ఒకకలఁగంటిఁ, గంటి ఘను నొక్కనిఁ జక్కరవింటివానిపో
లికఁ దనరారువాని, నమ లీమసకాంతులనొప్పువాని, సం
వికసితసారసాక్షు, మఱి విన్నది గన్నది గాన మెవ్వఁడో?
సకి! యిట వచ్చి నాసరస జాణతనమ్మునముండె నుండినన్.

ఉ. నేనును వానిపై రథముగ నేరక మారక ఠోరకార్ముక
జ్యానినదంబు సోకి తమి నంది, చెవుడ్పడి చూచుచుండఁగ వాఁ
డూనని పేర్మి దివ్యఫల మొక్కటియిచ్చి యదృశ్యుఁ డయ్యెఁ జం
ద్రాననా! చంద్రుఁ డజ్జలధ రాంతర మొందినరీతి నంతటన్.

ఉ. తత్తరపాటు జెంది మది తల్లడిలంగను మేలుకొంటి నా
చిత్తసన్నిభాంగుఁ డెటఁ జెందెనో యిట్టటఁ గ్రూరుఁ డైనయా
చిత్తజుబారికిం బడఁగఁ జేసె నికం దమిఁ దాళఁజాల నే
నిత్తఱిఁ బల్కవమ్మ దయ నిందున కేమియొనర్తు భామినీ!

వ. అనిన శుకవాణి యిట్లనియె.

ఉ. ఈ కల మంచిదమ్మ! మది నింతుక సంశయ మొందకమ్మ! యా
శ్రీకరగాత్రుదర్శనము చేకురునమ్మ! శుభావహంబు ను
శ్రీకర మైనపండు నత సిద్ధియు నొంగదవమ్మ! మేలు మే
లీ కల నాకు సమ్మదము హెచ్చెఁగదమ్మ! సుధాకరాననా!

వ. అని యిట్లు బలుకుచున్న సమయంబున.

సీ. మలయాగములజారి • వనయాగములదూరి,
కలయాపగలఁజేరి • పొలుపుమీఱి
ఘనసారసములొంది • ఘనసారములఁజెంది,
మనసారఁజెలువంది • తనివిఁబొంది,
మల్లికానవహేమ • వల్లికా సుమనోమ
తల్లికాయుతసీమ • నల్లికఁగని,
కేళికారతిలోన • బాలికాసుకపోల
పాలికాసమలీల • మేలుగాంచి,

తే. శారికాకీరపరభృత • చంచరీక
కలిత కలకల నినద సం • కలిత చలిత
విరహిజనమానసాంభోజ • వీథియగుచుఁ
గలయు నేతెంచె శీతల • గంధవహుఁడు,

వ. అట్టి సమయంబున.

శా. రాకాశీతమయూఖజాలములు మే • రల్ మీఱి మైనిండ ను
ద్రేకాంభోజశరాశుగావళులు లోఁ • ద్రిప్పారఁ బాటీరశై
లీకాంచత్పవనంబు పైపయిఁ గడున్ • హెచ్చై విజృంభింప ము
క్కాకం జెంది సహింపఁజాలక తమిం • గాసిల్లి మూర్ఛిల్లినన్.

వ. అచ్చటనున్న నయ్యాళీసందోహంబు లాహాకారంబు నొంది.

ఉ. ఇవ్వని కేలవచ్చితిమి • యిందఱముం గుమిగూడి? వచ్చి యీ
పువ్వులతోఁట నేల సొరఁ • బూనితి? మిప్పుడు పూని యిచ్చటం
గ్రొవ్వున నేల నిల్చితిమి • గొబ్బునఁబోక? యటంచు మించుబోం
ట్లవ్వనజాక్షిఁ జూచుచు సహా యనుచున్ వదరెడి సహాయమించుచున్.

చ. కలగనువారలుం గలరు ♦ కల్గిన యీ కలవంటి దెక్కడం
గలుగును? కల్ల నివ్విధము ♦ గాసిలుచుండెడి కాంత లెక్కడం
గలరు? వధూటులార! యిఁకఁ ♦ గార్యముమీర వచింపరమ్మ! యీ
చెలి నిట నుంచఁగాఁ దగదు ♦ చేరుద మింటికి వేగ బాగుగన్.

వ. అని యిట్లుచితంబుగా శైత్యోపచారంబులు సలిపి సేదదేర్చి యీ
రాజపుత్రినిం దోడ్కొనిపోయిన నాలోన.

సీ. సాంధ్యకృత్యములెల్ల ♦ సలిపి, యిష్టుండైన,
యీశ్వరునకు నమ ♦ స్కృతు లొనర్చి,
భుజియించి తావులఁ ♦ బొలుపైనచందన
మలఁది, పువ్వులుదాల్చి ♦ హారరాజి
భరియించి వలువలు ♦ ధరియించి, తాంబూల
మునుజేయుచును వచ్చి ♦ మోదమంది,
శయ్యపై శయనించి ♦ చందురుని వేడుకఁ
బరికించి వీక్షించి ♦ భావమలర

తే. నింపుమెయి బిల్వాణుండు వ ♦ ర్లింపఁ దొడఁగె,
నిదియు విరహిణులకుఁ జూడ ♦ మదన
మెదఁ బొడమఁజేయు విత్తనం ♦ బెన్న మఱియు
మరునకు బలంబు వరచంద్ర ♦ మండలంబు.

వ. అని మఱియు నిట్లనియె.

ఉ. కలువల నిద్రలేపి రతి ♦ కాంతుని సాంద్యము వాపి. పుష్కర
స్థలిఁ దిమిరంబుఁ జోపి,రతి♦ జాలనిభాలల నూఁపి, దేవతా
వలి కమృతంబుఁజేపి యల ♦ వాసవదిక్సతికుంకుమంబునై
కలువలఱేనిమండలము ♦ కాంతిలుచున్నది తూర్పుకొండపై

చ. జలనిధిపంక మంచు, మహి ♦ చాయయు జిహ్నము లేడిపిల్ల కం
దళితసురేంద్ర నీలమణి ♦ ధామ మటంచు వచింతు రంద, టీ

కలువలతేనియందుఁ గల • కందును నే ననుకొందు రాత్రి యం
కలవడ మ్రింగినట్టి తమ • మంతరసంస్థ మటంచు నెంతయున్.

చ. చంపురుడ న్మృగాధిపతి, శౌర్యవిజృంభణవృత్తిఁబూని పా
రంబరదక్షరేంద్రకుమా • రంబుసముండి రుచుల్ సెలంగఁగా
మందల కేగుడెంచుచు దు • మంకరికుంభము స్యాంశు రేఖికా
బృందనఖంబులం జదుప • వీడినముత్యము లయ్యెఁ దారకల్.

సీ. ఈకళానిధివల్ల • నేకదా దిక్కుది
క్కులవారలెల్లనుఁ • దెలివిఁ గనుట.
యీ వసుఖనివల్ల • నేకదా విబుధులు
కోరికల్ దీరంగ • గుడుపుఁగనుట,
యీ మహౌషధువల్ల • నేకదా సభ్యులై
న్నఁగ నిశాచరులెల్ల • దిగులు గనుట,
యీ సత్ప్రభునివల్ల • నేకదా మోదించి
కువలయం బెచ్చుగాఁ • గూర్మి గనుట,

తే. అవుర! యీరాజుమహిమ గనే • నుగఁగవచ్చుఁ
దమము వారించి, యరులసం • తతి నడంచి,
యన్యరతి డించి, హరిపద • మాశ్రయించి,
యుదయగిరిదుర్గమున నుండి • యొప్పుచుండె

ఉ. ఈ యుదయాద్రి రాజవగి • రీశ్వర మీసిత భానుఁ డెన్న దా
క్షాయణి నేలు శంకరుఁడు • కప్పుగళచ్ఛవి దావుఁ జుక్కలై
నాయకమూర్తి యాపన్రిమథ • నాథులు ఒక్కన చుక్కలు స్మృహ
శ్రేయ మొసంగ స్వప్రరుచిఁ • జెంది భజించు వియోగపాలికిన్.

సీ. ద్విజరా జటంచు బ్రభా • వించుటయేకాని,
రూఢిగా దోషాక • రుండు వీఁడు.
సన్మార్గగతుఁ డంచు • జనులు పల్కుటెకాని,
దండిమీరిన సిశా • టుండు వీఁడు,

నమృతకరుం డంచు • నాఖ్యమాత్రమెకాని,
చర్చింపఁగా విష • జనుఁడు వీఁడు,
కువలయప్రియుఁ డంచుఁ • గోరి చెప్పుటెకాని,
పాడిదప్పిన చక్రి • వైరి వీఁడు
తే. తమము వారించు రాజను • క్రమమెకాని,
యేపుమీఱంగ నారుల • నేచు వీఁడు,
ననుచుఁ గులటలు దూషింతు • రనుచు జనుల
త్రోవ రా వెఱచితో నీవు • తోయజారి!

క. సురల తెరువు వోసాగితి
వరయఁగ సత్పతి వదేథ • శాటుఁడవా నీ
కిరవొందఁగ విధునామము
హరిహరి! తలఁపంగఁ జెల్లు • నా కమలారీ?

క. కమలంబున జననంబయి,
కమలాసనుఁ డనఁగ బరఁగి • కరకరమతిచేఁ
దమిఁయింతురే వియోగుల,
క్రమమున నావిడిచి మలిన • గర్వం బందుర్.

చ. హరి కబళించుటల్, హరున • కంబక మూటఁ, దమిసప్రియందుఁ దే
జరిలుట, నీటఁ బుట్టుటను • ఛాయలు గాంచుట, మేను బెంచుటల్
ధరణిధరంబు నెక్కుటను • దగ్గుట, మిన్నులు ముట్టివచ్చుటల్,
గరకరి బాంధకోటులను • గాల్చుట నగ్నిని సిద్ధమే శశీ!

సీ. ఓరి! మాయునురేల • పోసికొనెదవురా?
ఘోరంపు నీమేను • దొండిబోను!
ఘెలఁగి రాపేలచే • సెదవురా? ఖేచర
స్థాళి నీకండలు • పంచుకలిన!

యీలీల మము గాసి • యేల పెట్టెదవురా?
పర్వంబులను నిన్ను• పాము గరవఁ!
గోధించి మమ్మింత• వేధించనేలరా?
కాలారి విసరి ని • న్నేలఁగొట్ట!

తే. అనుచుఁ బాంధులు నిందింతు •రందువలన,
లలిఁ బ్రవేశించెనో యీక • ళంక మొకటి
గాకయుండిన, శుచిమూర్తిఁ • గాంచు నీకు
మలినతావృత్తి గలుగునే • జలజవైరి?

సీ. ఘాంచి యెంతయుఁ దోడఁ • బుట్టినదానిల్లు
కంప వెట్టిన మహా • ఖలుఁడు వీఁడు
చలపట్టి వెలనిశా • చరవృత్తిని సదాళీ
తేజంబు లడఁచు నిం•దితుఁడు వీడు
కలఁగి ఘోషింపఁగాఁ• గన్నతండ్రినిఁబట్టి
భంగ పెట్టిన ఘోర • పాపి వీఁడు
మెఱసి యాపయినున్న • మిత్రుని విభవంబుఁ
జూడఁ జాలని నికృ • ష్టుండు వీఁడ

తే. టంచు భువిలోన విరహిణు • లాడుకొనఁగ,
సిగ్గుదోఁపక మిన్నంది • చెలువుమీఱఁ
దిరుగుచున్నాఁడ విధుడింత • తెలివిలేక,
తాళు వెన్నెల చీఁకటుల్ • ధవళకిరణ!

సీ. మేరదప్పనివాఁడు • మేదిని నీతండ్రి
నిత్యజీవనవృత్తి • నీదుతల్లి
యిష్టసంపదలెల్ల • నిచ్చు నీతోఁబుట్టు
నెమ్మిఁ బ్రోచెడువాఁడు • నీదుబావ

వరుస మనోధర్మ • వరుఁడు నీయల్లుండు
నిర్మలచిత్త నీ • ధర్మపత్ని
చక్రిపాలనకళా • శాలి నీమిత్రుండు
విబుధులపాలు నీ • వితరణంబు
తే. తమము వారించు నీదుసం • దర్శనంబు,
నిఖిలజనులకు మోదంబు • నీదుమూర్తి,
యిట్టిసంపద గలుగు నీ • యట్టిరాజు,
కోరి చూచినఁ గలఁడె? యో • కువలయేశ!

వ. అని యిట్లు బిల్హణుఁడు జందురునిఁ బేర్కొని బహుప్రకారంబుల వర్ణింపుచున్నయెడ,

తే భోజనముఁ జేసి కొప్పునఁ • బూలుదురిమి,
చందన మలంది తాంబూల • మందివేడ్క,
గొలువుగావచ్చి యామినీ • పూర్ణతిలక,
యవనికాభ్యంతరమున • శయ్యను వసించె.
ఉ. అక్కడ నా కవిక్షితీ వ • రాధిపుఁ డిందునుగూర్చి నేర్పునన్
వాకొని తద్విశేషములు • వర్ణన సేయఁగ నాలకించుచోఁ
దేకువ విస్మయాంబునిధిఁ • దేలి మనం బలరంగ శంకచేఁ
గోకిలవాణి యిట్లనియె • గూరిమితోఁ దనలోన నేపునన్.

—• రాజకన్యక కవిరచించు చంద్రవర్ణనవిని యాలోచించుట •—

క. తపుజనకుం డీసత్కవి
నమరంగ జాత్యంధుఁ డనుచు • నా వచించెన్

గ్రమయొప్పఁ జంద్రవర్ణన
సుమహితముగఁ జేయఁదొడఁగెఁ • జూచినకరణిన్.

శా. అంధుం డెక్కడ, చంద్రుఁ డెక్కడ,తదీ • యంబైన యావర్ణనా
బంధం బెక్కడ? నిట్టివింత గలదే • భావింప నెచ్చోటనై
నం? ధాత్రీంద్రుఁడు మాకు నిర్వురకు నం•దం బొప్ప నన్యోన్యః
త్సంధానం బగునంచుఁ జేసె, నిటులం • జర్చింప వేఁలున్నదే?

వ. అని మఱియును.

క. 'వ్రతభంగ మయినఁ గానీ,
మతిమంతు నుదాత్తవేషు • మానితవిద్యా
న్వితునిం గాంచెదఁ గన్నుల
కతుల మహోత్సవముగాఁగ • నని చెలి బ్రీతిన్.

—• కన్యక కవిసిఁజూచి మూర్ఛిల్లుట. •—

సీ. వినుతవిద్యాజిత • ద్విజరాజు ద్విజరాజు
రుచిరాజు నగుమోము • రుచులవాని
రమణీయవాణిభా • రతికాంతు రతికాంతు
నతికాంతిఁ దెగడు సో • యగమువాని
నతులితశుచివిభా • హరిమిత్రు హరిమిత్రు
పరమైత్రిగల్గువై • భవమువాని
కలితతేజోల్లస • త్కమలాప్తుఁ గమలాప్తు,
గమలాప్తి మెఱయు చం • దములవాని,

తే. సకియ మదినెంచి తమి మించి • సంభ్రమించి,
చేతు లలరించి, తెఱవంచి • చెలువు మించి

పొంచి తిలకించి పులకించి ◆ పొలుపుఁగాంచి
కాంచె రోహిణి చంద్రునిఁ ◆ గాంచినట్లు
క. కాంచినయంతనె సతిపుల
కాంచిత దంతురితదేహ ◆ యై నిశితోద్య
త్పంచశర శరవిపాటన
సంచలితస్వాంతయై వె ◆ సన్ ధృతిదూలన్.
తే. పరవశముఁనొంది మూర్ఛాను ◆ భావయగుచుఁ
బవనచాలన నిపతిత ◆ వల్లిమాడ్కిఁ
బంకజాయతలోచనఁ ◆ బడియె మఱియుఁ,
బట్టుదప్పిన కనకపుఁ ◆ బ్రతిమ బోలి.
ఉ. అకడ బిల్హణాఖ్యకవి ◆ యత్తఱిఁ దామరసారిఁ గూర్చి మెం
తో కర ముప్పతిల్ల విను ◆ తుల్ పచరింపుచునుండి యంతలోఁ
బ్రాకటబద్ధకాండపటి ◆ పై రమణీమణి మోముఁ జూచి య
స్తోక మహోదయాద్రిపయిఁ ◆ దోఁచిన చంద్రునిఁ బోల్చియిట్లనున్
—◆ బిల్హణుం డాకాంత ముఖాద్యంగంబుల వర్ణించుట. ◆—
సీ. రాకేందుబింబమో ◆ రాజీవమో మించు
టద్దమో లేక నె ◆ మ్మొద్దు మొగమొ
చెలువొందుకల్వలో ◆ చేఁపలో మరునినా
రాచములో లేక ◆ లోచనములొ
కోకంబులో విరిగుత్తులో బంగారు,
కుండలో లేక వక్షోరుహములొ
సౌదామినియొకొ న ◆ క్షత్రమో నునుపైఁడి
తీగమో లేక న ◆ తీతిలకమొ
తే. ఔర! యీకళ, యీతావి ◆ యీరమణత,
యీవిధంబును, యీబెళ్కు ◆ యీయశలత,

యీసువృత్తత, యీసొంపు • యీమెఱుంగు,
యీతళుకునిగ్గు, యీచాయ • యెందుఁగలదు?

సీ. హరిణవిముక్త శీ • తాంశుబింబముగాని
పురుడింపఁగా నిది • ముఖముగాదు,
ఘనసుధాపూర్ణ కాం • చనకుంభములుగాని
చర్చింప నివి యురో • జములుగావు,
పంచశిలీముఖ • బాణపంక్తులుగాని
నలుఁ నొప్ప నివి వీక్ష • ణములుగావు,
చెలువొందు యువజన • శృంఖలంబులుగాని
గుఱిమీఱ నవియు ము • గురులుగావు,
తే. డాలుమించిన మించు ట • ద్దాలుగాని,
గణుతిఁగొన నివి గండభా • గములుగావు,
సోయగం బయిన బంధూక • సుమముగాని
భావమున నెన్నఁగా నిది • మోవిగాదు.

మ. క్షితి నిట్లుగ్ర శశిరేఖనిల్తుఁ గలువ • ల్గెందమ్ములౌరే కబ్జముల్
లతికల్ గుంభము లాకసం బిసుక • తిన్నెల్ రంభలుం గాహళుల్
శతపత్రింబులు భావలీలఁ గొని యీ • చంద్రాస్య ఫాలాక్ష ని
ర్జితదేహార్థ శుకరాజవాహు మొలిపిం • చె న్మేనఁ జిత్రింబుగన్.
మ. ఉరువక్షోజయుగాంతరస్తమయి నా • యుల్లంబు రాదేమి? త
ద్భరసంస్పృష్టి నశించెనో విరహసం • తాపాగ్నిచే గ్రాగెనో?
స్థిరలావణ్య సుధాసరోవర సదా • ప్తి న్మగ్నమైనో? కామత
స్కరవీరుండు హరించెనో? నవవయః • కాంతార సంచారుఁడై.
వ. అని మఱియు నిట్లనియె,

సీ. ఈభామ తనుకాంతి • నేపారఁ జూచిన
హేమాభిధానంబు • నెంచ నేల?
నీచాన యూరుపవ్రి • భాచాకచక్యంబు
రంభాభిరూప్యంబు • రహిఁ నడంచు
నీరామ నవ్యనా • సారమ్యలీల తి
లోత్తమాఖ్యను దల • నెత్తనీయ
దీకొమ్మ కన్నుల • నిరవొందు బెళ్కులు
హారిణీవిలాసంబు • నపహసించు

తే. నిటుల గాత్రైకదేశము • నటమటించు
సారవారవధూటికా • సామ్యకలన
మనుజలోకంబునందుండు • మానవతుల
నఁగనెంతయు దీని మా • నంగ వశమె?

సీ. చెలియ పెన్నెరిగుంపుఁ • జేపట్టఁగలిగెనా
ఘనసంపదలు వేడ్కఁ • గాంచినట్లు,
కాంతమోమున మోము • గదియింపఁ గలిగెనా
యతులిత రాజత్వ • మబ్బినట్లు,
ముద్దియ కన్దోయి • ముద్దాడఁ గల్గెనా
యింపుమై కువలయం • బేలినట్లు,
వనితకంఠాశ్లేష • మొనరింపఁ గల్గెనా
యరుదారఁ బెన్నిధి • యబ్బినట్లు,

తే. కలికి కెమ్మోవి చవి జూడఁ • గలిగెనేని
నురుసుధాహారవైభవం • బొందినటుల,
నెలఁతతోఁగూడి క్రీడింపఁ • గలిగెనేని
నతను సామ్రాజ్యమంతయు • నమరినటుల.

చ. వనజ మహావిభూతి హరి • వైఖరిఁ గాంచుఁ బదస్తనోరువుల్
వనజ మహావిభూతి హరి • వైఖరి మించు గళోరువేణికల్
వనజ మహావిభూతి హరి • వైఖరి దూఱుఁ గరాక్షిమధ్యముల్
వనజ మహావిభూతి హరి • వైఖరి మీఱు దృగాస్య యానముల్.

సీ. ఈభామ వదనాబ్జ • మెలమి గాంచినయంత
విధుని సంభావించి • వెలసినట్టు
లీచాన నెఱికురు • లెనసి పట్టినయంత
నీలకంధరసేవ • నెగడినట్టు
లీయంబుజాక్షి క • న్దోయి ముద్దిడునంతఁ
గమలజ సద్భాతి • గలిగినట్టు
లీరామ కెమ్మోవి • యింపార నంటిన
నరుణబింబాలోక • మమరినట్టు
తే. లవుర! తనకింతకంటె భా • గ్యంబు గలదె?
యతనుమంత్రాధిదేవత • యనఁగవచ్చు,
నీచెలినిఁ బొందఁ గోర్కెలీ • డేరఁగాక!
వేఱె మదిఁబూని తపముఁ • గాపింపనేల?

సీ. సారంగములమీఱు • సారంగములగేరు
దొయ్యలికొప్పు క • న్దోయిరొప్పు
పున్నాగముల నెంచుఁ • బున్నాగముల నొంచు
నలినాస్యగతిసొంపు • నాభిపెంపు
చంద్రఖండము నేలుఁ • జంద్రఖండము బోలు
సుదతిచెక్కులలాగు • నుదుటిలాగు
కాంచనంబు హరించుఁ గాంచనంబు • హసించు
తరళలోచనానాసా • తనుపిలాస

(8)

తే. మధుర! యీముద్దుచెలిఁ బొంది • నట్టివాని
భాగ్య మెన్నంగవశమె యా • పద్మభవుఁడు
దీని సృజియించువేళ వా • గ్దేవి నెదుట
నుంచుకొని చేసెఁ గాబోలు • నొండుగలదె?

ఉ. దీనిముఖాంబుజంబు గను • తింపఁ గళానిధియొక్క కోనమం
దూని వసించుగాక నయ • నోద్ధతి వాకొని కల్పలొక్కచో
మానుగ నిల్చుఁగాక మృదు • మంజులవాగ్గతిఁ జెప్పవల్లకీ
స్వానమడంగుగాక మిను • చాయకు గ్రుక్కెడ మధ్యమెన్నగన్.

సీ. ఊహించి పున్నమ • యొక్క ప్రొద్దుండునో,
ముద్దియ నెమ్మోము • ముద్దులాడ
దనరార సత్ఫల • దానముల్ సేతునో,
నెలఁత కెమ్మోవి తే • నియలు గ్రోల
బంగరుకలశముల్ • బరగఁ బూజింతునో,
పడఁతి చన్గుబ్బలు • పట్టియాడఁ
జెలువొంద భూప్రదే • క్షిణము గావింతునో,
యతివ కటిస్థలి • నధివసింప

తే. నిటులఁ గాకున్న గల్గునే • యింతితోడి,
సంగతు లటంచుఁ దమిమీఱ • నంగజాతి
జాతతాపాతిశయమున • సతిని మతిని,
మమతఁ బెనగొని వర్ణించు మఱియు మఱియు.

సీ. పొలతిపాదములతోఁ • బొందు సేయఁ దలంచి
తామరల్ పరికించి • తమ్ములమ్యోఁ,
గలికి పాలిండ్లతోఁ • జెలిమి సల్పఁగఁ గోరి
భావించి చక్రిముల్ • పత్తులమ్యో,

సుదతి కెమ్మోవితో • జోడు గూడఁగఁ బూని,
చెలఁగి మంకెన బంధు • జీవమయ్యె,
హరిణాక్షి నెమ్మోము • నాశ్రయింపఁగఁ జూచి
మిహిరాంశుఁ డెలమి స • న్మితుఁడయ్యెఁ
తే. చంద్రముఖి యంగములు పంక • జాతములని,
యరులని, విహీనగుణయుని • భరితదోషుఁ
డని కదియ దూరముగఁ జేసె • నాత్మనిత్య
మృదుల సుస్నిగ్ధ తాస్మిత • విదితకళల.
ఉ. పట్టుగ నీవధూటికచ • పాళిభజింపఁగ నీలమేఘమే
గుట్టలఁ జెందునో ముఖము • కోరినుతింపఁగఁ బూర్ణచంద్రుఁడే
తట్టునఁ జేరునో మఱియుఁ • దార్కొని యారుదలంపఁ బాము లే
పుట్టలదూఱునో సమతఁ • బూనఁగలేక విచిత్రవైఖరిన్.
మ. నతిహృత్పుష్కరసీమఁజన్గవగిరీ • శపాత్రనల్ సేసి త
ద్గతిఁబ్రాపించిన యోర్వమిన్ విషధరా • కారంబుఁ దాఁ బూనె నా
రతిపంచాననలీల దాల్చె నడుమా • హాయంచు ధమ్మిల్ల మా
శితకంఠత్వము నొంద నెమ్మొగము గాం • చెన్ సోమభావం బొగిన్.
సీ. కాఁబోలు నిదియు చా • క్కపు సుధాకరరేఖ
కాదుబో నిష్కళం • కతఁ జెలంగెఁ,
గాఁబోలు నిది యశో • కపుఁదూపుదొరమాయ,
కాదుబో సశరీర • గరిమ దనరెఁ
గాఁబోలు నిదియు చ • క్కనివేల్పుపూఁబోఁడి,
కాదుబో విభ్రమే • క్షణములొదవెఁ
గాఁబోలు నిదియు దొ • ల్కరితీవియ మెఱుంగు,
కాదుబో నిశ్చల • గతిఁ దనర్చె

తే. ననుచు రతిపతి మోహాస్త్ర • తాంబుగాళి,
మగ్నుఁడై విస్మయాక్రాంత • మానసాబ్జుఁ
డై సరోజేక్షణారూప•మరసి యరసి
నేర్పుమీఱంగ మఱియు వ•ర్ణింపఁ దొడగె.

చ. కడువడి రాహువేర్చి నవ • కంజవిలోచన యాస్యచంద్రునే
ర్పడర హరింపఁగా దొడరి • యస్మదశాతికరాళియంచు నే
ర్పడ మదిలోఁ దలంచి మఱి • గ్రమ్మఱి వెన్నున నిల్చెనో యనన్
జడ యలరెన్ ఫణాగ్రరుచి • చాడ్పున రేగడి బిల్లపైఁ దగన్.

చ. కళలకు ధామమై జలజ • గర్వ మడంచి సుధాప్తి తారకా
కలన జెలంగి తెల్విఁగని • కాముక పాళికి గుండెగాలమై
యలరెడు భామినీవదన • మైందవబింబ మనంగఁ జెల్లదే
కలయఁగ గానిదో నచటఁ • గల్వల వేరిటి కన్ను లొప్పునే

చ. కలువలుమీఱఁ దుమ్మెదలు • గాంత కనుంగవకోడియందుఁ గా
వలసినకోర్కె దీని గెలు • వం దగువీరుఁడు మారుడంచు దూ
పులుగ ధ్వజంబుగా గుణము • పొందిక గా నమర్చి దానిభ్రూ
చలనముతోనఁ దద్ధనుపు • సంగతిఁ దప్పినఁ బోయె నన్నియున్.

క. వనితముఖాంబురుహస్థితి,
బనిగొని కాముకుల గెలవ • భావజుఁ డెలమిం
దనయుభయపార్శ్వముల నుం,
చినచక్రములో యనంగఁ•జెవు లలరారున్.

శా. భ్రూకోదండముఁబూని దృష్టివిశిఖం • బుల్ తోన సంధించి బ
ల్లాకాచంద్రునిఁబట్టి రెండుతునియ • ల్గావించి తత్సారమున్
బోకుండ న్నవరించి పార్శ్వముల నిం • పుల్ నింపఁగానుంచెనో
నాకంజేక్షణ చెక్కుటద్దముల చె • న్నారుం దళుకు్కంచొగిన్.

చ. వరసుమనోవిలాసముల • వైఖరి మాని తిలోత్తమాఖ్య యీ
ధరసుమనోవిలాసములఁ • దద్దయుఁ గాంచెద నంచు వచ్చి
యుద్ధురగతి నువ్వుమాత్రికుల న • ధోముఖియై తపమాచరించి యీ
కరివరయాన నాసయయి • గాంచెనమ స్తవిశేషవాసనల్.

సీ. క్షణవిలాసమె కాని • సరియౌనె చిగురాకు,
సుమనోనురాగ వి • స్ఫూర్తిగనిన
బయిచాయయే గాని • పగడంబుసాటియె,
యమృతాకరద్వీప • మందు మనిన
దీర్పులవన్నెలకాక దీ • టౌనె బలుకెంపు,
వరసువర్ణావాప్తి • వఱలకున్న
నెరుపుమాత్రమెకాని • యీడెబంధూకంబు,
కమ్మతేనియతోడఁ • గలసికొనిన

తే. సతతశోభాన్వితంబైన • సారమగుచు,
సరసమైరుచిగన్పడి • చక్కనగుచు
జక్కెరలమించి ద్రాక్షపం • డుక్కడంచి,
యమరు నీవనితామణి • యధరమునకు.

క. కుందంబుల నవమౌక్తిక,
బృందంబుల దాడిమంపు • బీజంబుల యా
నందంబుల జిగిగుంపుల,
చందంబుల నపహసించు • సతిదంతంబుల్.

చ. అతులిత మైనశంఖము స • మంచితగానము నేర్పుమంచు నీ
యతివగళంబుఁ జెంది తన • యందలివైభవమెల్లనిచ్చి త
ద్గతిని భజించి యంత బలు • కష్ట రహిం బాల్పడ దయ్యెఁగా జడ
స్థితులకు నబ్బునే స్థల వి • శేషముల ... 

తే. ముద్దుదనమునేచు పగఁబూని • మోముఁరూపుఁ,
జెందు విందునికరముల • శ్లిష్టకుసుమ
బిసలతలఁ గట్టి యెగిరిత • న్నసముమీరు,
జిక్కవలవంగఁ జెలి బిగి • చన్ను లమరు.

తే. వనితగంభీరసరసలా • వణ్యవార్ధి,
యురుసుధాపూర్ణకుచకుంభ • యుగముఁగాంచి
సకలలోకుల మిగుల ని • ర్జరులఁజేయు,
నేకకలశంబు గాంచు కం • ధీశుఁడెగడి.

మ. స్మరుఁడ న్విప్రుఁడు యవ్వనం బనుతానూ • జాతోద్గతిన్ బాల్యమ
న్వరుడుందీర్ప శుభావహోజ్వరసమ • న్వణాహ్యహుల్ జేయుచో
వరుస న్నిల్పినపూర్ణ హేమకలశ • ద్వంద్వంబు నాఁబోల్పు నీ
సరసీజాన్యపయోధరద్వయము భా • స్వత్పత్రిరేఖాంకమై.

తే. ముగుద బాల్యపయోనిధి • మునిఁగిడాగి,
యవ్వనంబను హరిహయు • నలఘుకృపను
చెలఁగి వెలువడి వచ్చిన • శిఖరులనఁగ,
గాంతయురమునఁగుచములుఁ • గానఁబడియె.

తే. పడఁతి జఘనంపుతిన్నెల • పైకినెక్క,
కాయజుఁడుపొక్కిలను సోరం • గమునదూరి
తెగువ కుచమర్మయుగము సా • ధించుకొఱకు,
దార్చు నిశ్రేణినా వళి • త్రయమెసంగు.

చ. చెలిబలితంపుగబ్బివలి • సిబ్బెపు నిబ్బర పుబ్బుగుబ్బ చ
న్నుల నెఱిగొప్పుభారమున • నున్నని తిన్నెలమించు బల్ పిఱుం
దుల నసియాడు కౌను పడు • నో యనుశంక సరోజసంభవుం
డెలమి రచించి గీల్కొలుపు • నిన్నుసలాకన నారుతీరగున్.

చ. అరయఁగ నాభిపుష్కరము ♦ నడిమి విహారము కొంతసల్పి సుం
దరతరయౌవనం బను వ ♦ నంబున బాహులతల్ చలింపఁగా
సరసపయోధరస్తబక ♦ సంగతిఁ గమ్మని తావి కెక్కి వి
స్తరగతి నేగు తుమ్మెదల ♦ చాలననారు చెలంగు నింతికిన్.

చ. జడయను తోఁక వెన్కడర ♦ సారపుకుంకుమచాదు రేఖ లే
ర్పడర మిటారి గుబ్బలను ♦ భారపుఁ గుంభము లందమొప్పఁగాఁ
దొడరెడు నారు సోరనెడు ♦ తుండము సాచి మనోజదంతి రా
జుడుగక నీరుద్రావు కొల ♦ నోయన నాభి చెలంగు నింతికిన్.

మ. చెలిసింగారపు పువ్వుదోఁట రసముల్ ♦ జెల్వొప్పఁగా నింపఁ బూ
విలుకాఁ డన్బలుకాఁపుగుబ్బలను మే ♦ ల్బీరంపు టెద్దుల్ ఘటిం
చిలలిన్నీరపు టారు మో కెలమి బు ♦ ట్టిన్పట్టి మోటెత్తు మె
చ్చులఁ జెంగల్వపు భావియో యనఁగ మిం ♦ చు న్నాభిగంభీరతన్.

క. చనుఁగవ బరువో లేకం,
బెనఁకువగల శోభనాంగి ♦ పిఁదులు బరువో
యనిగనవిధి పిడికిటఁబ,
ట్టినపట్టో యనఁగఁగాను ♦ తేవ న్వెలయున్.

మ. జననాథాత్మజ కాంచనోరుయుగళీ ♦ స్తంభాగ్రభాగంబుపైఁ
బెనుపై ముత్తరులంత రాళులుగ నా ♦ భీ ద్వారమం దొప్పఁగా
స్తనజాంబూనద కుంభకుంభిత తనూ ♦ సౌధాంతరస్థాయి మా
రుని సింహాసనమో యనంగఁ జెలువా ♦ రుగాంచిదేశంబు గిన్.

తే. మరుఁడు శృంగార వీఁకు లే ♦ ర్పరచి తనదు,
సేరనొక పెట గట్టి సం ♦ కీర్తి తోర
ణాలనుంచిన కాలు గం ♦ బాలనంగ,
గలికియూరులు చెలఁగు బ్బే ♦ [illegible]

క. మకరములను లోఁ బెట్టుక,
రకముగ వరశాలులను ధ • రం బశవైచెఁ
నకి జంఘిక లని యెంతయు,
బ్రకటించెం గాహళులు ర • వంబుల దిశలన్.

తే. నెఱియ సారసములు తమ్ము • నేలఁ బెట్టి,
కాలరాచుచు నున్నాఁడు • కలువలచెలి
వెతలఁ బడఁ జాల మిదిరాహు • వేణియనుచు,
నతివపదము లఁ బడెనన • నడుగులమరు.

తే. నిర వలంబంబు తమయుండు • నిలయ మెల్ల,
నందునిల వాదరిక లేద • టంచు వగచి
వచ్చి తారక లొకకొన్ని • వనితపదము,
లందెనో యన వేళ్ళ న • ఖాళు లమరు.

వ. అని మఱియు నిట్లనియె.

సీ. చెలియ పెన్నెఱిగుంపు • చీఁకటి దల దన్నె
వదనము కళఁ బట్టె • జదిపె విధుని
చెలువకన్నులు లేళ్ళ • చెవులు వట్టాడించెఁ
గర మొప్ప గళము శం • ఖంబు నూఁదెఁ
బాలఁతి చన్నులు చక్రి • మలఁ బొమ్ము వెనఁ ద్రొక్కె
నారు సర్పముఁ గడు • నంటి పొడిచెఁ
జెలికటి పైకత • ములవెన్కఁ బడనొత్తె
నెత్తమ్మి నడుగుల • నేలఁ బెట్టె
మిసిమి బంగారు పైనెక్కె • మేనిచాయ,
ఏమనఁగవచ్చు నిక్కాంత • యింపు సొంపు
మించు నవయవ సౌష్ఠవం • బెంచిచూడ,
వశమె వెయినోళ్ళుగల ఫణి • వరునకైన.

తే. కురులు కుటిలతగావించెఁ, ♦ గుచములందుఁ,
గఠినత విధించె సారస♦గర్భుఁ డెలమి
చెలఁగి యీకాంత మన సట్టు ♦ చేయఁడేని
యతని పుడమినిఁ జతురాస్యుఁ♦డనఁగవచ్చు.

—♦ కామిని మూర్ఛదేరి కవిం గలియుగోరుట. ♦—

వ. అని.

క. ఈరీతి బిల్హణుండు మ
హారూఢి నిజామభావము ♦ మతిసేయం
గా రామ తద్వచోమృత
సారంబున మూర్ఛదేరి ♦ సంస్మృతి గలదై

తే. యామినీ పూర్ణతిలక య ♦ త్యంతపులక
దేహయై లేచి మదిని సం ♦ దేహ మెడలి
యబ్జనిహాసించు కవివద ♦ నాబ్జనుమరఁ,
గాంచియూహించె నిజవిలో ♦ కాంచితముగ.

సీ. ఈకమలేక్షణు ♦ నెద నసించినగాని
యల నిశాచరుగర్వ ♦ మడఁపఁజాల
నీసర్వమంగళా ♦ హితుఁగూఁడగాఁగాని
యంగజాతవికార ♦ మార్పఁజాల
నీవిభుధేందుని ♦ హితము చేసినఁగాని
యొసఁగ మరుత్తతి ♦ నేలఁజాల
నీబ్రహ్మతేజుని ♦ యొనసిపల్కినగాని
యిల ఖగాలి నధిక ♦ రింపజాల

తే. నితని భాస్వత్కరాబ్జ సం • గతులఁ జెలఁగి
యేర్పడకగాని మదితమిఁ • దీర్పఁజాల
నితని యధరామృతంబు నా • యిచ్చదీరఁ
గ్రోలఁగాఁగాని తాపంబుఁ • గూల్పఁజాల.

వ. అని మఱియుఁ దనలో నిట్లనియె.

తే. చదువుఁజెప్పంగ గురుఁడయ్యె • సాహసమునఁ
జూడఁ జూడంగ మరుఁడయ్యె • సోయగమునఁ
దలఁపఁ దలంపఁగ రాజయ్యెఁ • గలితకళల
నిందు కేమి వచింతునే • యిందువదన?

ఉ. ఏలఘుచిత్త నేఁగదిసి • యీనవమోహనరూపుసన్నిధిన్
బాలినిఁ జేరితే యితని • భావ మదెట్టిదో కానరాదుగా
లీలఁ బరిగ్రహించు నొకొ! • లేక గ్రహింపక పోవునొక్కొ! నేఁ
దాళఁగఁ జాల, నింతి తను • దానె కడంగినఁ జుల్కనౌఁగదా.

వ. అని మఱియును.

ఉ. ఏగతిఁ బోవుదాన, మఱి • యీతసి నేగతిఁ బల్కుదాన నా
లాగు మదిందలంపక క • ళానిధి కాదని పల్కనాపయిం
గాఁగల కార్యమెట్టిదొకో! • కానిమెడం దన గౌరవాప్తి యెం
తాగడ మానొ యిందులకు • నన్యవిచారము లేమిసేయుదున్.

వ. అని యివ్విధంబున వితర్కించి.

ఉ. రాజకుమారికా మణిని • రాళి విని దాళఁగ లేక తూలినన్
యోజిత కాండ వస్త్ర ముప • యోగము లేమికి మాని యప్పుడున్
రాజిత శయ్యపైఁబడి స • రాగముగా విలపించె నాత్మభూ
రాజశరాళికి న్నిలువ • రానితమిన్ భ్రమ ముప్పతిల్లఁగన్.

తే. హా కళాకాంత చతురాస్య! • హా కఠోర
మారనిశితశరాళి వే • మాఱు నాటి

కలఁచె సంతాపమొదవ న • న్గరుణఁజూచి,
పేర్మిఁగానవయ్య బాధఁ • దప్పింపుమయ్య!

వ. అని నర్మగర్భంబుగాఁబలికిన నప్పలుకులు కఠోరమారవీరఘోరట
చ్చాపగుణటంకార నినదంబులు వినని చందంబున విని భావంబు
గ్రహించి సంచలిత హృదయుండయి కవిపుంగవుం డిట్లనియె.

—: కామినీ నర్మ గర్భవాక్యములు విని కవి పలుకుట :—

ఉ. తామరసాక్షి నీసిశిత • దారుణ వీక్షణ తీక్ష్ణబాణముల్
వేమఱు నాటి నాహృదయ • వీధి వ్రణంబొనరించెఁ జూడుమా
నీమెయి సౌషధద్వితయ • మియ్యవె శ్రావెదఁ బూఁతపూసెదన్
నీమధురాధరామృతము • నీకుచకుంకుమ పంక మేర్పడన్.

వ. అని మఱియు నిట్లనియె

సీ. కరుణతో ననుఁజూచి • కాయజుశరహతిఁ
దప్పించు మిప్పుడు • తరళనయన
చిఱునవ్వు వెలయించి • చెలువైన వెన్నెలల్
మాయింపు మిప్పుడు • మచ్చెకంటి
పలుకులువగఁగుల్కఁ • బల్కి పైకధ్వనుల్
మాన్పవే యిప్పుడు • మధురవాణి
మోవిపానకమిచ్చి • మోహదంభకతృష్ణఁ,
దీర్చు మిప్పుడు మోవి • తీఁపులాఁడి

తే. కరము లలరించి దిగ్గనఁ • గౌఁగిలించి,
రొమ్ముడలి చలి పాపవే • భాన్వ • దురిసిజాత
యతను సామ్రాజ్య మేలించి • యాదరించి,
వలపు లీడేర్పవే హేమ • లలితగాత్రి.

—: కామిని కవిశయ్యపైఁజేరి సరసల్లాపములతోఁ గ్రీడించుట :—

మ. అనినం దామరసాక్షి కాండపటమ • త్యంతంబుఁ బోఁద్రోచి గ్ర
క్కునఁ దచ్ఛయ్యకుఁ జేరి ప్రౌఢగతి సం • కోచింపకన్ లె మ్మహో
యని చేదమ్ములు చాఁపి చన్గవ నెదన్ • హత్తించి గాఢంబుగా
ఘన మోహమ్మునఁ గౌఁగిలించెఁ గవియుం • గౌతూహలంబొప్పఁగన్

మ. కరముం జేర్పకమున్నె పోకముడి వీ • కన్వీడెఁ జన్దోయిఁ జె
న్నారయంబట్టకమున్నె జిల్గు అవి కెం • తోవీడి వేపట్టున
న్వారిసెన్ ముగ్ధ మొగంబుఁ జూచుటకు ము • న్నే స్వేచ్ఛ నాలోకనం
బరయ విస్మృతమయ్యె నాసతికి వ్రీడా • వ్యాప్తి గోల్పోవఁగాన్.

చ వలయవిశేషనాదముల • వైభవసంగత భాస్వదంగకం
బులు పులకాంకుర ప్రకర • పూరములం బ్రవిబోధితాత్మభూ
సలలిత తత్సమార్గములఁ • జన్నులురస్థలిఁ గుమ్మునట్లుగా
జెలువ సుఖింపఁజేసెఁ గవి • శేఖరుఁ బైకొని కౌఁగిలింపుచున్.

వ. ఆసమయంబున బిల్హణుం డిట్లనియె.

శా. భూరిగ్రాహగభీరభీషణమహాం • భోరాసులన్ దాఁటియా
స్కారంబింతయులేని యాకసమునన్ • సంచారమున్ జేయుచుం
గ్రూరోద్యన్మృగపర్వతాగ్రముల నా • రోహించుచు న్నీయశం
బోరాజాత్మజ యొంటిమై భుజగలో • కోద్వృత్తి రాజిల్లునే.

వ. అని మఱియు నిట్లనియె.

తే. రమణి! మీతండ్రి మదనాభి • రామనృపతి
చేసినట్టివినోదంబు • చిత్రమయ్యె
చిత్తమున వేఱె తలఁపక • చెలఁగుమతుల
రతుల భయమింక వల దిఁక • రాజువలన.

వ. అని నిజాంకంబునఁ బంకజగంధి నునిచికొని శంకలేక నిరంకుశమీనాంకమత్తమాతంగంబు హృదయపంకంబు భేదింపఁ దద్వదనశశాంకమండలంబు నాలోకించి యిట్లనియె.

తే. నెమ్మితపము గావించితి • నిన్నుఁ గూర్చి
జపమునల్పితి నీపేరు • చాలఁదలఁచి
ధ్యాన మొనరించితిని రూప • మాత్మనునిచి
మంత్రదేవతగా నిన్ను • మంజువాణి.

వ. అది యెట్లంటేని.

సీ. సరవి నెన్నడును భో • జనము సేయఁగలేదు,
నీమీఁది ప్రీతిచే • నీరజాక్షి
యెలమిగా నెన్నఁడిం • తులను గూడఁగలేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి
యరయ నెన్నఁడు చంద • నాది చర్చయులేదు
నీమీఁదిప్రీతిచే • నీరజాక్షి
చెలఁగి యెన్నఁడు మాల్య • ములు ధరింపఁగలేదు,
నీమీఁది ప్రీతిచే • నీరజాక్షి

తే. కాన, భదీవయ విరహయో • గమున నాకుఁ
గలవరింతల మనసట్లు • గాఁ దనర్చుఁ
గాంచి నమ్రుఁడనైన స • త్కవిని నన్ను
రాగ మిట నూని ప్రోవవే • రాజపుత్రి!

ఉ. ముందర నున్మద్విపస • మూహసమంచితకుంభ కాంతరా
మందసరక్త మేదమున • మత్తిలిచూచెడి సింహమున్న సం
స్పందనపల్లవోల్లసిత • పల్లకి మానునె సామజంబు నా
చంద మెఱింగి పొందు మిట • జాగొనరించెదవేల బాలికా!

వ. అనిన దరహసితవదనయయి సుందరదన యిట్లనియె.

క. కవిరాజశిరోభూషణ
దివిషత్సాన్నిజాస్యలైన • దీవ్యద్భువదీ
యవరాకృతిఁ గనియే కో
రి వలతు రేననఁగ నెంత • శ్రీతనయనిభా!

సీ. శృంగారమూర్తివై • చెలువొందు నినుఁ జూడ
వలెఁగాక కన్నులు • గలఫలంబు
చక్కనైనట్టి నీ • చెక్కులు ముద్దాడ
వలెఁగాక కెమ్మోవి • గలఫలంబు
మది కింపు సేయు నీ • యెదఱొమ్ము పెనఁగుమ్మ
వలెఁగాక చన్నులు • గలఫలంబు
నేర్పు మీరినయట్టి • నీతోడ మాటాడ
వలెఁగాక నాలుక • గలఫలంబు

తే. సేవ సేయంగవలెఁగాక • చెలువరాయ,
యలరులను గేరు చేదోయి • గలఫలంబు
కలసి రతులను మెలఁగి పెం • పగ వలెఁగాక
కవిశిఖామణి చెలిమిచేఁ • గలఫలంబు.

శా. నీలావణ్యము, నీకళాతిశయముల్ • నీసౌకుమార్యాప్తియున్,
నీలాలిత్యము, నీవిలాసగతులున్ • నీమంజువాగ్వైఖరుల్,
నీలీలాతనుభాతి, నీసరసము • న్నీ యందమున్ జూచి నే
నే లోకాంతరు నైనఁ బొందుటకు నై • యేలా యపేక్షించుటల్.

వ. అని యిట్లు బలుకు సంతోషిత స్వాంతుండై కవిభూకాంతుండుఁ గాం
తాలలామ కుచకాంతత్వం బపేక్షించి యిట్లనియె.

సీ. పరభూమిభృత్తుల • భరముద్రుంచినవేల్పు
మాంద్యంబు లడఁగించు • మహితకీర్తి
మైత్రిచేవెలసి ధ • ర్మముగాంచు గుణశాలి
కర్పూరచ్ఛాయలు • గలుగుమేటి
ఘనపుష్పమాలిక • నెనసిన నెఱజాణ
వాసన వ్యాపించు • భవ్యరూపి
వరయుక్తి నఖిలవై • భవము లందినరాజు
చంద్రిలేఖల నేలు • సరసమూర్తి
తే. యగుచు నఖిలదిశావళి • నాక్రమించి
ప్రేమ జనులను బాలించు • పేరుగాంచి
దొరలకు దొరై చెలంగుచుఁ • దోయజాక్షి
మెలమి సిగబ్బిగుబ్బపా • లిండ్ల జోదు.
వ. అని మఱియు నిట్లనియె.
సీ. మీనాకృతులఁగాంచు • మెఱయా నీకన్నులు
గచ్ఛపరేఖ మీఁ • గాళ్ళఁజెలఁగు
భూదారభావంబు • బొందు నీజఘనంబు
హరిలీలఁ వాల్చు నూ • గాఱుతీరు
వామనాకృతిఁబూను • వలనొప్ప నీకొను
భూమిభృద్వైరులై • మొనయుఁ జన్ను
లమరు రామాభిఖ్య • మై నీముఖాబ్జంబు
నీలాంశుకస్ఫూర్తి • నెగడు గుఱులు
తే. రతులఁ దేలింపనుఁ బ్రబుద్ధు • బాల వపుదు
వరయఁ గలికివి యన్నిటి • నరసి చూడఁ
దనర నీయందున దశావ • తారమహిమ,
రుచిర లావణ్యసీమ తా • రుణ్యధామ.

సీ. ఘనులఁ బోషించు నీ ◆ కచపాళి, రాజ స
న్మానంబుఁ గాంచు నీ ◆ నగు మొగంబు
కువలయం బలరించుఁ ◆ గూర్మి నీకనుదోయి
శ్రీలఁ బెంపొందు నీ ◆ చెలఁగుశ్రుతులు
యిష్టఫలావాప్తి ◆ నెసఁగు నీకెమ్మోవి
కలల మెప్పించు నీ ◆ కలికిచన్ను
లహితాప్తి నడఁచు నీ ◆ యలరారు నూగారు
సరసుల మెచ్చు నీ ◆ సరసనాభి,
తే. లసదనంతవిభూతి నీ ◆ యసదుగౌను,
చక్రములను భరించు నీ ◆ జఘనసీమ,
యతుల భద్రకరములు నీ ◆ యరిదితొడలుఁ
పడఁతి! పద్మంబుసేయు నీ ◆ పదయుగంబు.

వ. అని వినుతింపుచున్న కవివరునిం గదిసి మాటిమాటికి నూటిగొన సాటివచ్చు జక్కవల నుక్కడించి నిక్కి క్రిక్కిరియు మిక్కుటంపు సొంపుఁగల సిబ్బెంపు నిబ్బరపు గబ్బిగుబ్బల నురంబుతిరంబుగా నొత్తి తత్తరిలఁ గేలమ్ముల నిమ్ముగాఁ గ్రుమ్ముకొన వెనుకకుఁ జనక మొనసి వనితామణి నెనసి మనసిజసంగరంబుతిరంబులకుఁ గరంబు దురంగలించి దొలంగి మెలంగుచు నితరేతరసమాకర్షణంబు లాచరించుచు నన్యోన్యమధురాధరానుపాన క్రియాంతరదశనక్షత విజృంభణంబుల సీత్కారంబులు నెరపుచుఁ బరస్పరవిశేషవిభవ శరసమరసముత్పాహంబుల నిట్టూర్పులు నిగుడించుచు స్మరవిశిఖ శిఖరసఖంబులగు నఖరముఖంబులన్నటులు మెఱయఁగాటులుఁ బచరించుచు ముఖముఖావలోకన నిరోధక చికురనికరంబులు కరంబులను గరంబు చిక్కఁ జిక్కఁ జక్కసవరించుచు స్థలాసలవిశేషంబు లవలంబించి చిఁబిరిగొనక హితం

బుమెఱయఁ జుంబించుచు, ఘూత్కృత ఫూత్కృత భూత్కృత హుంకృత సీత్కృతగృహాణగృహాణ ముంచముంచేత్యాది నినదంబుల కనుగుణంబులగు కాంచీసముచిత ఘటికా మంజుమంజీరవలయ నినదంబులు వినుచు, నాగ సింహ కుక్కుటహంసాదిబంధవిశేషంబులఁ బరిభ్రమించుచు నలయుచు, నలపులు వెలయఁగలయుచు నిలుకడల నిలుచుచుఁ దొలంగినఁ దొలంగక మలసి పైకొని చేకొలఁదులఁబట్టు దప్పక నిట్టట్టు తెట్టగిలక దిట్టలై గుట్టుమట్టులేక వీఁకఁదాకుచు నీల్లు షష్టిహాయన ద్విరదంబుల విధంబున నందంబుగాఁ గందర్పుని దర్పం బడంచి మించి సౌఖ్యవారాశిఁ దేలుచున్నంత.

చ. పులకలు జగ్గు నెమ్మినెఱ • పుట్ట జిగినెమ్మొయిగ్గు జెయ్యులట
వలఁగొనుసిగ్గు వింత యరః • వాలుగుఁజూపుల కగ్గునొదల
న్నెలకొనుతగ్గుమారడఁపు • నేర్పుల నెగ్గు ఘటిల్లనొప్పు న
చ్చెలి నలరించెఁ దారతులఁ • జెందుచు ... టికి మోహమంచుచున్.

సీ. అసదాకృలింగనా • భ్యసనఖర్వితకుచం
బర్ధనిమీలనో • ద్యద్వియోగ
మాశానుకాల క్రి • యారోధినుంగాక్ష
మాచిత్రిమాంబుక • ణావృత్యాన
మతి గాఢపరిపీడి • తాధరాధరబింబ
మనుదితమణితకరి • మానుకలన
మస్ఫుటీకృతతధే • త్యాలాపకౌశలం
బతిసాంద్రజనితరో • ... ంచవారి

తే. మకరిమార్గబద్ధముగ్ధచే • ష్టాభిరామ
మతిశయానందపరవశాం • గాంగ మపిది
తాన్యచింతనమూచకో • రాక్షికపుడు
ప్రథమసురతంబు కవిలోక • పతియొనర్చు.

ఉ. వెచ్చని పచ్చిగోరు లర • విప్పు కనుంగవతీరు లారజం
బెచ్చిన తక్కు లాత్మ కపు • డింపు ఘటించు నుమక్కు లార్పులున్
విచ్చిన మోవి కెంపు లెద • నిండిన నెయ్యంపుసొంపులుం దగన్
రచ్చకునెక్కెఁ జోరహిత • రాజమఖీ సురతప్రసంగముల్.

తే. పరగ నీరీతి రతిమనో • భవులపగిది
యామినీపూర్ణతిలక బి • ల్హాణుడు నతుల
రతులఁ గ్రీడలు సలుపుచు • రమణతోడ
ననుదినంబును నట్లుండి • రంతవేడ్క.

క. తారాయన తటినీశత
తారాంయన శిఖి శిఖాంక • ధాత్రుజహారిగా
ట్రాబాచలనాయక గీ
స్తారాచల రాజరాజ • సఖ సత్కీర్తీ!

భుజంగప్రయాతము. కథావిప్రధానా ప్రి • కాశాభిధానా
బుధారాధి తార్థ ప్రి • భూతాఖిలార్థా
సుస్వాగకీర్తి సు • విద్యానువర్తీ
సుధామాధురీ వాగ్వి • శుద్ధానుభావా.

ఇది ద్వితీయాశ్వాసము.





శ్రీరస్తు.

# బిల్హణీయము.



## తృతీయాశ్వాసము.



శ్రీ. మహితరూపజితశత
కామా! కామాంధకార • గర్వోద్ధత సు
త్రామారి మదనిషూదన
క్షేమాకర దివ్యనామ • సీతారామా.

తే. అవధరింపుము తదనంత • రావధాన
మహిమ బిల్హణ కవితోడ • మంజువాణి
యామినీ పూర్ణతిలక వి • హారగరిమఁ
దనరుచున్నంతఁ జెలులు త • త్కార్యమెఱిఁగి.

—•చెలులు కామినీ కవి సంగమము నెఱిఁగి రాజున కెఱిఁగించుట•—

వ. ఇట్లు తమలోన.

క. ఓకమలనేత్రి! వింటే,
యీకవి సన్నిధిని సరసి • జేక్షణ యెంతో
చేకొని విద్య గ్రహించును
గాక, మఱియు నిపుడు కాని • కార్య మొనర్చెన్.

తే. ఇందు కేమందు మమ్మ,యో • యిందువదన!
విభున కెఱిఁగింపవలెఁ గవి • విభుని నడత

మనకు దాఁచంగనేటికే ♦ మనఁగ వలసీ
మీఁద నెటుఁబోయి యెటువచ్చు♦ నో తలంప.

వ. అని తర్జనీకలిత నాసాగ్రి యగుచుఁ చుక్కమనుచు రాజసాన్ని ధ్యంబున కేతెంచి మ్రొక్కియున్నంతఁ బ్రిసన్నవదనుండయిన యన్నర పాలుం గనుంగొని గద్గదకంఠయై విన్నపం బాకర్ణింపుఁడని వారిలో నొక్కబోఁటి యిట్లనియె.

తే. రాజ రాజేంద్ర మదనాభి ♦ రామనృపతి!
దేవర కుమారి యాకవి ♦ ధీరువలన
విద్యయభ్యాస మొనరించు ♦ వేళ బద్ధ
కాండపట మంకుశముగాఁగఁ ♦ గపట మొదవె.

చ. ఎఱుఁగరాదు దైవకృత ♦ మెట్టిదయో, మన మంజువాణియున్
గుఱిగొని యద్ధరామరునిఁ ♦ గూడినయట్టుల మాకుఁ దోఁపఁగా
గుఱుతెఱుఁగీవిధంబు మది ♦ గోప్యముఁ జేసిన హాని వచ్చునం
చఱిముఱిఁ జెప్పవచ్చితి జ ♦ నాధిప, యేమిఁక బుద్ధి మీఁదటన్.

వ.అనిన విని యత్యంతకంపితస్వాంతుండై భూకాంతుండు నిట్టూర్పు లెసం గఁ దనలో నిట్లనియె.

క. ఏ నొనరించుట యెట్టిది
యైనవిధం బేమి యాఱు ♦ డాయెను భువిలోఁ
దానొకటిఁ దలఁప దైవము
మానుగ మఱియొకటి దలఁపు ♦ మాట నిజంబై.

వ. అని వితర్కించి వారలంబనిచి పుత్త్రికామణి సమీపంబునకువచ్చి యిట్లనియె.

—♦ రాజు తనకూతురు సమీపంబునకువచ్చి నీతులుపలుకుట. ♦—

శా. పట్టీ! రాజకుమారశేఖరులఁ బి ♦ ల్వంబంచి భూపాలకుల్
చుట్టాలందఱు మెచ్చఁగా నగరమున్ ♦ శోభిల్లఁగాఁ జేసి మే

ల్వట్టఁ దిట్టముగా స్వయంవరమునన్ ♦ భాషించు నిన్నేమి నే
నెట్లో సేయఁదలంచి తిం పొదవఁగా ♦ నిచ్ఛానుకూలంబుగన్.

ఉ. కోరిన రాకుమారకున ♦ కుం బ్రియ మాదఁగ నిన్ను నిచ్చి యెం
తో రహిమీఱు సౌఖ్యమున ♦ నుండెదవంచుఁ దలంచియున్న నా
కోరిక లెల్లఁ బోఁదలఁచి ♦ కొంకు కళంకములేని మత్కులం
బారగ దుర్యశంబు మహి♦ నందఁగఁ జేసితి వమ్మ బాలికా.

వ. అని పలుకుచున్న జనకునిఁ జూచి పుత్త్రికామణి యిట్లనియె.

—♦ సుందరి తనతండ్రితోఁ దాను దోషరహితురాలనని చెప్పుట ♦—

శా. అయ్యా! యెన్నఁడు లేనివార్త లివి యే ♦ మత్యంతముం బల్కెదీ
వయ్యో! నీవొనరించు కృత్త్రిమమె నీ ♦ యాత్మవ్యథంజేయు నా
త్మీయాస్యాబ్జముఁ జూచితే మదికి♦ సందేహంబుగాఁ దోఁచెనో
నీయాజ్ఞం దెలి యంకుశంబుఁగదె ♦ నిర్నిద్ర నుకంపానిధీ!

క. ఏమయ్యా! యేమిటివిటివి?
యేోపహితా! యెటులఁ దోఁచు ♦ చున్నది నీకున్?
మామక చిత్తము దెలియదె?
నామది సంశయములేదు ♦ నవ్యవిచారా!

క. నీయాజ్ఞ లేని కార్యము
మాయయ్యా! సేయ నోప ♦ మాయిరవురకు
న్నీయెడ హృత్సంయోగము
నేయుక్తి ఘటించుఁ దెర హ ♦ రింపఁ దరంబే.

క. అదిగాక నాకు వశ్యము ♦ న్నది
యెఱుఁగవె యంధకుని మ ♦ నంబున నైనం

బదపడి దర్శించను నీ
మది నన్యవిచార మేల ♦ మానవపాలా?
వ. అనినఁ గరుణాయత్తచిత్తుఁడై రాజోత్తముం డిట్లనియె.
చ. తొడరఁగఁ బూర్వ మేను నుయన ♦ దో యది పోవఁగనిమ్ము పుత్రి! నీ
గడవఁగలేను వంశము ని ♦ కారము సేయక నింకనైన నీ
నడతలు మార్చియుండు సుమ ♦ నస్థితి సత్కులసూతి కెంత యి
య్యెడ నొక రాజకుమారునకు ♦ నిచ్చెద నిన్నుఁ గృపామతిన్ దగన్.
వ. అనిన విని మనం బొప్పక శంకారహితచిత్తయై మత్తగజయాన యిట్లనియె.

—♦ కాంత తనమనంబు కవియం దాసక్తమై యున్నదనుట ♦—

మ. ధరణీపాల! వచించెద న్వినుము చి ♦ త్తం బత్తులున్ ఘ్రాణమున్
వరజిహ్వాశ్రుతు లంచితం బయిన సం ♦ స్పర్శంబు నాధీరునం
దు రతి న్నిల్చెను బుద్ధిపూర్వకముగాఁ ♦ దోడ్తోడ నింకేరికిం
గరమై యిచ్చెదు చేతనారహిత మీ ♦ కాయంబు న్యాయంబుగాన్?
వ. అనిన విని రోషారుణితాక్షుండైన రాఘవుండు శీఘ్రంబుగా సభాస్థలంబునకువచ్చి కుపితమానస సింహంబుకరణి సింహాసనాసీనుండై సభాసదులం గలయం గనుంగొని యిట్లనియె.

—♦ రాజు కుపితుండై సభాసదులతో నాలోచించుట ♦—

తే. అమర నంతఃపురద్రోహ ♦ మాచరించు
వాని నే శాస్తి సేయంగ ♦ వలయు? మీరు
ధర్మపద్ధతిఁ బలుకుఁడు ♦ తగినశాస్తి
సేయుదము వాని సద్గుణ ♦ శ్రేష్ఠులార.

వ. అనిన విని సభాసదులు గలంగి మనంబుల ఘనంబులుగాఁదోఁచి యా
లోచించి యిట్లనిరి.

క. కార్యాకార్యము లెఱుఁగక
మర్యాదలు నడపువాని ♦ మహిపతి యెంతే
నార్యానుమతిని హిమవ
ద్ధైర్యా! దండింపవలయు ♦ దండధరుండై.

వ. అందు నొకకొందరిట్లనిరి.

క. ధరణీశ! విచారించిన,
ధరణీతలమందు నన్ని ♦ తప్పులె చూడం
గరుణించి కావవలయును,
బరికింపఁగ నెట్టులైన ♦ భవ్యవిచారా!

వ. అనిన మఱికొందరిట్లనిరి.

ఆ. లేత మదు రెఱింగి ♦ నీతి దండింపఁగా
వలయుఁ గొన్ని మాన ♦ వచ్చుఁ గొన్ని
మానఁదగవు గొన్ని ♦ మహిమీఁద ధరణీశ,
యెంతకార్యమైన ♦ నిదిఁడు హితము.

వ. అనినఁ గొందఱు రాజుభావం బెఱింగి యిట్లనిరి.

క. ఏకార్యమైన మానవ
లోకోత్తర! యమునిరీతి ♦ లోకంబు నా
లోకించి దుర్జనావళిఁ
గైకొని దండింపకున్నఁ ♦ గలుషము వచ్చుక్.

వ. కావున శిక్షాకరణంబు కర్తవ్యంబనిన విని తలవరులం బిలుపించిన.

సీ. గండ్రగొడ్డండ్లు గొం ♦ గళ్లును జికిలి చ
ల్లాడములైన చ ♦ ల్లాడములును

గుబుతుచంగులఁ తల ♦ గుడ్డలఁ గావు బో
ట్లినుపకడేలుఁదా ♦ ళ్ళినుపదుడ్లు
నీలికాసెలు మెడ ♦ నీలికుచ్చులతాళ్లు
బిరుదైన వడిసెలల్ ♦ బిల్లమెట్లు
కాలుమేనులు బలు ♦ కోరమీసములను
బిగివంపు చూపులు ♦ బెట్టుగుళ్లు

తే. నొడల గోరోచనపుఁ బూఁత ♦ లుట్టిపడఁగ
వచ్చి తలవరులెల్లరు ♦ మెచ్చుదొరయ
నిలిచి చేతులు జోడించి ♦ నేర్పుతోడ
దండమిడి యొరయ్యైయున్న ♦ ధరణివిభుఁడు.

వ. అందు వీరసేనుండను నొకతలారినిం జూచి యిట్లనియె.

—♦ రాజు బిల్హణునకు శిరచ్ఛేదం బాజ్ఞాపించుట ♦—

శా. ఓరీ! బిల్హణ నామధేయకవి ను ♦ ద్యోగించి రాఁదీసి దు
ర్వారస్ఫూర్జిత దీర్ఘపాశములచే ♦ బంధించి కొంపోయి బల్
దూరం బయిన స్మశానవాటి ముఖ మా ♦ లోకింపక న్నిర్దయా
ధారస్వాంతుఁడవై తదీయ శిరము ♦ ద్దామాప్తి ఖండింపుమా.

వ. అని ముమ్మాఱుఁ బలికి పొమ్ము పొమ్మని సెలవొసంగిన వీరసేనుఁ
డిట్లనియె.

క. కోపముచే శిక్షింపను,
భూప యనుగ్రహముచేతఁ ♦ బోషింపఁగ దక్షుం
డేపట్ల నృపతి వసుమతి,
నీపద్ధతి నరసిచూడ ♦ నితఁను గలఁడే.

క. దేవర లేమివచించిన
నావిధమున సేతు నేను ♦ నది యట్టిదో మీ
భావము యోగ్యా యోగ్య వి
భాసముగాఁ గానవలయుఁ ♦ బరహిత బుద్ధీ.

వ. అని పల్కిన భూపాలుఁడు కోపించి యావలి కుముఖుండయిన వీరసేనుండు

క. భూపాలుఁడు చెప్పిన వినఁ
డాపాపము పుణ్యమంత ♦ యవ్విభునిదె తా
రూపించినట్లు సేయుదు
నీపట్టున దైవయోగ ♦ మెట్లున్నదియో.

వ. అని తద్గృహంబుఁ జొచ్చి

తే. పుస్తకము చేతఁబూని త ♦ త్పూర్వకార్య
మెఱిఁగి తనలోన సతి భజి ♦ యించువాని
నొదిగి శయ్యాతలంబున ♦ నున్నవాని,
ఛిల్హణులఁజేరి తలవరి ♦ బెగడ ననియె.

క. ఓకవిరాజ శిఖామణి!
నీ శ్లోకవిన్నపముసేతు ♦ నృపవరుఁ డిపుడుం
జేకట్లు కట్టుకొని చని
యాకట దండింపు మనుచు ♦ నాజ్ఞ నొసంగెన్.

తే. దేవ! నీపట్ల నిదియేమొ ♦ తెలియరాదు,
చెప్ప నెంతయు వినఁడాయె ♦ శీఘ్రగతిని
రెమ్మనుచు డాసి వాఁడు చేఁ ♦ దమ్మిపట్టి
తిగిచి యురుపాశములను బం ♦ ధించెనంత.

తే. కవివరుఁడు లేచి దిక్కులుఁ ♦ గలయఁజూచి,
మంత్రిదేవతఁగా నార ♦ ముణి నిజాత్మ

నిలిపి, తలవరివెంబడి ♦ నిశ్చలమతిఁ
జనియె నచ్చటి జనములు ♦ సందడింప.

వ. అప్పు డొక్క సఖిలలామంబు త్వరితగతింజని రాజపుత్త్రితో నిట్లనియె

—♦ రాజపుత్త్రి కవియవస్థను సఖివలన నెఱింగి
తండ్రింజేరి యడిగికొనుట ♦—

శా. అక్కా! బిల్హణుఁ గోటపాలకులు పాత్రిజ్యస్ఫూర్తి దుర్వారులై
చిక్కంబట్టి మహోగ్రపాశముల నా ♦ క్షేపించుచుం బాహువుల్
పక్కల్ జెక్కలు మొక్కలంబుగ వెసన్ ♦ బంధిచున్మట్టి యా
చక్కింబోవుచు నున్నవారిదె సఖీ ♦ శక్యంబెవీక్షింపఁగన్.

వ. అని పలికిన పలుకులు చెవులకు ములుకులు జొనిపినట్లైన యమున నాహాకారంబునొంది యిందుకు నేమి చేయుదునని విచారించి దిగ్గున లేచి.

చ. నడు మసియాడ నెమ్మొగము♦నం జెమటల్ జనియింపఁ బాదముల్
తడఁబడఁ బైఁట జారఁ గను ♦ దమ్ముల నీరుఁదొలంగ వేణియు
న్వడివడి తూలియాడ నవ ♦ నింబడి లేచుచు నెల్గుతోడ న
ప్పడఁతుక సేరవచ్చెను స భాస్థలి రాజసమీపభూమికిన్.

చ. కఁటిలత రాహు వేచ్చి తన ♦ కోఱలఁ బాముగ నొక్కి మిక్కిలిన్
బొటబొటగా సుధారసము ♦ బొబ్బిలిచున్న శశాంకురీతి చి
చ్చటులవినీలకుంతలవి ♦ శాలవిలోచనపాళి నీర ము
త్కటముగ దూఁకఁగ వదన ♦ కంజము విన్నదనంబు దోఁపఁగన్.

క. నాతండ్రి! యీవిధంబునఁ
జేతురె? గిటజఁలమునకను ♦ సేతు వదేలా?

చేతమునఁ దలఁపు మా కవి
చేతో విభుఁ డన్యుఁ డొకఁ డు • చేపట్టెదనో.

క. అదిగాక బ్రాహ్మణోత్తముఁ,
డోదవును దోషంబు నీకు • నుర్వీశుఁడ నే
మిది రాజధర్మమగునే
పదపడి పోఁచుటయ మేలు • ప్రజలు నుతింపన్.

ఆ. భవ్యుఁ డితనివలనఁ • బాపమింతయులేదు
కామపీడితాత్ముఁ • గాన, నేను
గదిసి దోష మత్నిఁ • గట్టికొంటిని నన్ను
నాజ్ఞ సేయవలయు • నతని వలదు.

క. అటుఁగాకపోయినప్పటి
కిట నుంచక మమ్ము నొక్క • యెడ నుంచవె యు
త్కటదృష్టిచూని తండ్రీ!
యిటువలె సేయంగఁ దగ ద • హీనవిచారా!

క. ఇదియును గూడకపోయిన
నొడఁవగ మఱియొక్కయూర • నుంచుము మము నీ
వది గాదనినను మఱియొక
పదమున కీదేశ మెడలఁ • బంపుము తండ్రీ!

తే. నిగ్రహానుగ్రహములకు • నృపుడు దక్షుఁ
డరయ నందునఁ గార్యకా • ర్యములులేవె
యెన్నియుండిన బ్రాహ్మణు • నెంచరాదు
బ్రాహ్మణాభర' యనియెదు • పలుకువినవె?

వ. అని దీనాలాపంబులనబ్బాలామణ్ణి విలపించుచు మఱియుమఱియు ధ్వ
జినవైశ్వానరునియందు ఘృతంబుఁ జిలికిన చందంబున మండిపడి ప్రత్యు

త్తరంబియ్యక విముఖుండయినఁ గంబుకంఠి రాజువలనఁ దిరస్కృతయై యాస్థానంబు వెడలిపోవుచు నిట్లనియె.

సీ. తండ్రి నాపయి నింత ♦ దయనింపఁ డాయెఁగా
డాయెఁగాఁ బోయి నే ♦ దండ ఖఁడినఁ
దల్లి యడ్డపడి తాఁ ♦ దప్పించదాయెఁగా
దాయగాఁ దలఁచెనో ♦ తనయ యనక
నాళిజన శ్రేణి ♦ కాత్మ నింపాయెఁగాఁ
బాయఁగా రాని యీ ♦ పాటు విన్నఁ
గలవారికెల్లఁ గ ♦ న్నులు చల్లనాయెఁగా
నాయగాఁ గంపుఁ జం ♦ దంబుఁ గన్నఁ
తే. గటకటా! యెవ్వరైన నా ♦ కష్టముఁడిపి
ప్రోవలేరైరి లేరైరి ♦ భూతదయులు
నేమిసేయుదు నేమందు ♦ నెందుఁజొత్తు?
ననుచు వగచుచుఁ గవిమార్గ ♦ మనుసరించి.

—♦ కాంతామణి కవినిగూర్చి విలపించుట. ♦—

ఉ. హా! కవిరాజరాజమణి! ♦ హా! నవమోహన! హా! మనోహరా!
హా! కరుణాగుణాభ్యుదయ ♦ హా! రమణీ నవపంచసాయకా!
హా! కమనీయగాత్ర! యొక ♦ రైన నినుం గృపఁ బ్రోవరైరకో!
యీకడ నీవు దైవమున ♦ కేమి విరోధము జేసితోకదా!
సీ. వికటదుస్సహమహా ♦ విషము కంఠంబున
దాక్షాయణీశుండు ♦ దాల్పలేద,
సతతదుర్వార వి ♦ స్మృతశిఖాబడబాగ్ని
జలధి యంతరమున ♦ నిలుపలేదె,

సకల చరాచర • జంతుజాలమునెల్ల
నేర్పడఁ బుడమి వ • హింపలేదె,
పృథివీతలంబెల్లఁ • బృష్ఠభాగమునందు
నిలఁగూర్మపతి భ • రియింపలేదె,
తే. యంతకన్నను గవివరు • నందుఁగలదె
దోషభర మెవ్వరైనను • దొడరి బ్రోవ
రయ్య! భూపతి వినఁ జెప్ప • రయ్య! కరుణ
నింపరయ్య! నావెత నివా • రింపరయ్య!
సీ. మోహించి గౌతమ • మునిసతిఁబొందిన
పురుహూతు నమరులు • బ్రోవలేదె,
గురువధూగమనంబుఁ • గోరి చేసిన చంద్రు
నీశుండు మౌళివ • హింపలేదె,
కడిమిమై కూఁతును • గని పొందఁగోరిన
పరమేష్ఠి శౌరి చే • పట్టలేదె,
స్మరవశుండై సీత • చనుదోయి గీరిన
కాకిని రఘుపతి • కావలేదె,
తే. యంతయును ద్రోహ మీతని • యందుఁగలదె?
నేను గోరిన విప్రుండు • గాని, యితర
వంశజుఁడుగాఁడు ధర్మంబు • వరుసఁజూడఁ,
బుణ్యు లెవ్వైన నీకవిఁ • బ్రోవరయ్య.!
వ. అని మఱియు నిట్లనియె.

— • పౌరజన పరస్పర వాక్యములు.

ఉ. ఆకవిరాజుఁ బ్రోవ తన • కయ్యెడుఁ గాక యటంచు సుందరీ
లోకశిరోభూషణము • లోలత దిక్కులు చూచి తెంపుమై

రాకలు పోకలుం గలుగు ॰ రాజుల నార్యులఁగాంచి యెంతయుఁ
శోకముతో విలజ్జయయి ॰ సోలుచు వ్రాలుచుఁ బల్కెనిట్టులన్.

సీ. ఎక్కుడుగా మది ॰ నెంచి పండితహంస
నాదరింపరె చతు ॰ రాస్యులార!
కారుణ్యమున గతి ॰ గల్పించి ద్విజరాజు
భరియింపరే చక్ర ॰ భరణులార!
నిరుపమ సత్కళా ॰ నిధిని మన్నింపరే
తలమొడి రాజ ॰ వతంసులార!
విదితనిరాధారు ॰ విభుధేంద్రు నిలుపరే
యిరవొంద భూరీధ ॰ రేంద్రులార!

తే. సుకవితాపంబు దీర్పరే ॰ శూరులార!
బ్రహ్మకులజునిఁ దేరె గో ॰ పాలులార!
ధర్మగతిఁబూని, రాజకం ॰ దర్పులార!
నామనోహరుఁగూర్పరే ॰ నాయ మెఱఁగి.

వ. అని బిల్హణు నుద్దేశించి ముద్దియ యిట్లనియె.

మ. అరవిందంబులరీతిఁ జెన్నలరు నీ ॰ హస్తంబు లెట్లోర్చె ము
ప్పురిగాఁ బెంచిన కాలపాశములకు ॰ న్మగ్ధాంగనాగాన భ
వ్యరసోత్కర్షములైన నీశ్రుతియుగం ॰ బత్యుద్ధతోర్వీపకిం
కరవాదార్భటి కెట్లుతాళె మదనా ॰ కారా మనోనాయకా!

వ. అని యిట్లు పొగలి పొగలి.

తే. తరుణి నగరంబు గడచి పోఁ ॰ దలఁచియున్న
నున్నతాకారు లచ్చట ॰ నున్నవారు
వారణము సేయ నంతఁ ద ॰ ద్వారసీమ,
సీమవారలెల్లఁజూడ వీ ॰ క్షింపుచుండె.

వ. ఆసమయంబున నగరజనంబులు దమలోనఁ జా మిట్లనిరి.

సీ. అవనీశ్వరుఁడు నమ్మి ♦ యంతఃపురంబులోఁ
జేర్చిన నెంతయుఁ ♦ జేసె నితఁడు
కన్య నీవిధమునఁ ♦ గలుషాత్ముఁడై రతి
గలసె దానికి నింక ♦ గతియు నేమొ
యెంతపనికిఁజొచ్చె ♦ నీభూసురాధముఁ
డేర్పడ నిది బైట ♦ నెట్లుబడియె
దాఁగునా యిట్టిది ♦ ధరణీశుఁ డెంతయుఁ
జేసె నిర్వ్యాకు వీ ♦ క్షింపకుండ

తే. విప్రుఁడెక్కడ, మేదినీ ♦ విభునిపుత్రిఁ
గలయుటెక్కడ? యిదిచూడఁ ♦ గడిదివింత,
చెలఁగి చేసినవారికిఁ ♦ జేసినంత
యనుభవింపక తీరునా ♦ యవనిలోన.

క. ఏకాంతంబున నుండిన,
లోకములోఁ దలఁ పనెట్టి ♦ లోకులకైనన్
డీకొలుపు బుద్ధి పతిపైఁ
బ్రాకటముగ నారిననఁగఁ ♦ బనియేమి యికన్?

ఉ. చక్కనివారిలో మిగులఁ ♦ జక్కనివాఁడు కవీంద్రమౌళి యా
చక్కరబొమ్మ యట్టిదె వి♦ చారము లేటికిఁ జూచునంతలోఁ
జక్కెరవింటిజోదు రథ ♦ సమ్మన దూపులు వింటఁగూర్చి బల్
చిక్కులఁ బెట్టకుండునె వి♦ చింపఁగ నొంటిగనుండువేళలన్!

చ. కటకట! యెట్లు భూసురునిఁ ♦ గాసియొనర్పఁడటంచుఁ బంచె న
క్కుటిలుఁడు భూమిపాలుఁ డిది ♦ కూడదు చెప్పఁగ నేరికైన నిం
తటికిని దైవయోగముక ♦ దా తలపోయఁగ వానిభాగ్య మి
ప్పటికి ట్టులుండె, నిట్టిపని ♦ ప్రాజ్ఞుని కెచ్చటనైనఁ బాడియే.

చ. ఇల నిఁక నీనిఁబట్టి వధి । యించిన నీసతిమేనఁ బ్రాణముల్
నిలుపదు వానికిన్ జనని । నిల్వదు భూవరుఁ డంతట న్మదిం
దలఁపఁగ నేమియౌనొ, యట । ధారుణి యేవిధమౌనొ, యింతకుం
జలమఱి భూవిభుండు కవి । సమ్మతిఁ బ్రోచిన నన్ని చక్కనౌ.

వ. అని యిట్లు వేరవేర గుంపులుగట్టి పలుకుచున్న నొకకొంద ఱిట్లనిరి.

క. చోరుఁడను నామ మీకవి
కారయఁగను నేటికిని య । థార్థంబయ్యెన్
జారుఁడు మఱి రెండుం దగు,
శూరులు మెచ్చుదురె జార । చోరత్వంబుల్?

వ. అనుటయు నక్కాంతాలలామం బక్కవివరునిం జూచి యిట్లనియె.

ఉ. హా! కవిరాజచంద్ర! మద । నాంచిత విగ్రహ! నన్ను నప్పు డ
స్తోక వియోగవారినిధిఁ । ద్రోచి చనం దగవౌనె నీకు న
య్యో! కరుణాంబురాశి వని । యుల్లమునం దగనమ్మియుంటి, నీ
వేకత మెట్టులేగెదు ర । హిం గపగూడిన మేలుసెందదే.

వ. అని విలపించుచున్న మార్గంబునం బోవుచుండి విని బిల్హణుండు దోధూయమానమానసుండై తిరిగి చూచి యిట్లనియె.

—॥ బిల్హణుండు కామినింగూర్చి పలుకుట ॥—

ఉ. హా! కమలాయతాక్షి! చెలి । హాసరసీరుహకుట్మలస్తనీ!
హా కమనీయగాత్రి! సతి । హానవమోహిని! హా వధూమణీ!
హా కనకాంగి! నేను విడ । నాడితినంచుఁ దలంచెదవు నీ
లోకమునందు జీవునకు । లోలతగాక స్వతంత్రమున్నదే?

ఉ. ఓ రమణీమణీ! వికసి । తోత్పలపత్రవిశాలనేత్ర! స
న్నారక యేలఁ జూచెదవు । దర్వర సిపాసిని గోల దేవతా

వారవధూటికానయన ॥ వాగురికావలయంబునందు దు
ర్వారతఁ జిక్కి తా మగిడి॥ వచ్చునె బిల్హణుఁ డెన్నిభంగులన్?

వ. అని పలుకు భూసురవరునిఁ దలవరు లురుగతిఁ బదమని స్మశానవాటికిఁ దోడుకొనిపోయి యొక వటవృక్షంబుక్రింద నిల్పిన బిల్హణుఁడు నలుదెసలం జూచి తల్లడిల్లనియుల్లంబుతో మందస్మితవదనారవిందుండై వీరసేనున కిట్లనియె.

క. ఓ తలవరి!తడవేటికి?
నాతతనిశితాసిఁ గొని ధ ॥ రాధీశుప యా
జ్ఞాతంత్రిమునను బిల్హణు
వే తెగవ్రేయుము శిరంబు ॥ విశ్వము మెచ్చన్.

వ. అనిన విని వీరసేనుం డిట్లనియె.

క. కవిరాజవర్య! నీ కిపు
డవిరళగతి సించుకైన ॥ నాత్మభయుంబుం
దవులక దరస్మితాస్యుఁడ
వవుటకుఁ గత మెద్ది సెప్పు ॥ మమలవిచారా!

వ. అనిన బిల్హణుం డిట్లనియె.

చ. హితమతి న్వినుమ ॥ హీనగుణాకర వీరసేన! యా
క్షితిరమణాత్మజాత, సర ॥ సీరుహలోచన మంత్రిదేవతా
కృతియయి వేడ్క నా హృదయ॥ గేహమునందున జోడుగూడి తా
సతతముఁ బాయకున్నది వి ॥చారము లేటికి దైన్యమేటికిన్.

వ. అని మఱియు నిట్లనె,

చ. కలికివధూమణిన్ స్మరవి ॥ కస్వరచారు[illegible]న్ గుణాకరన్
సలలితతుంగపీనకరి ॥ నస్తసమధ్యగహారభాసురం
బొలఁతియు మోమునంటె రుచి ॥ పొందు సుధారక మైనరీతి నా
తిలసుమనాసిక న్మదిసి ॥ దేవతగా స్మరియింతు నెంతయున్.

—— తలవరి కవిని ఖండింపక యుంచుట ——

వ. అని తదేకాయత్తచిత్తుండైన కవివరునిం జూచి ఖండింపఁ జేతులురాక హృతబహుజనప్రాణం బగు కృపాణంబు నేలంబడవైచి వీరసేనుండు కృపాధీనుండై నిలువంబడియున్న తదనంతరంబు యవ్విప్రుండు రాజపుత్రిని హృదయంబున నుపలక్షించి యిట్లనియె.

చ. పరమసువర్ణచంపకవి • భాసురగౌరి సుహేమ రాజి ని
ద్దురఁగొని మేలుకొన్న సతి • తోఁపురుహాంబకవిహ్వలాంగిఁ దా
మరసదళాయతేక్షణఁ బ్ర• మాదకవశంబునఁ బోవు విద్యవై
ఖరి మదిలోన నెప్పటికిఁ • గాంక్షఁ దలిర్పఁగఁ జింతఁ జేసెదన్.

మ విలసత్పాకజమధ్యగౌరి రుచియై • పెంపొందు గోరోచనా
తిలకోదంచితపాటలద్యుతికన • ద్దివ్యలలాటంబు వై
లలి నొక్కింత మదంబుచే నలసలీ • లాఘూర్ణదృక్పాతనై
చెలువొందుఁ సతిమోహనరూ నిలుచునా•చిత్తంబుయుక్తంబుగాన్.

చ. శ్రమజలసాంద్రబిందుతతి • సారఘుమా క్తిక రాజనైఖరిం
గొమరు పెలంగ హేమమణి • కుండలదీప్తుల గండభాగముల్
రమణ రహింపఁగా నపరి • రత్యనుభూతి నియోగమంది చె
ల్వమరు తదాస్య మిప్పటికి •నాత్మభజించెద నిశ్చలుండనై.

ఉ. పున్నమనాఁటి చందురుని•బోలు మొగంబును మొల్కచన్నులున్,
సన్నపుటారు, లేవయసు • చాయలఁదేజిన మేనుసొంపు, నా
కన్నియరూపు నే మగుడఁ•గాంచితినేని మనోజసాయకా
గ్ని న్నెటికాఁకఁ దోఁకొనిన •నెమ్మని చల్లఁజేయుదున్.

ఉ. ఏవిధిఁ గాంతు నారమణి•నే నొకరాతిరి తుమ్మినం జిరం
జీవియటంచుఁ దచ్ఛుభవి• శేషవచోవిభవంబు మాని రో
షావహచిత్తయై పలుక • కందపుఁగమ్మ ఘటించెఁ గర్ణమం
ధావిధి నామది న్నదలి • యూడుచు నున్నదిగా ఘనంబుగాన్.

ఉ. ఉన్నతచారుపీనసుప • యోధర, భావజుచేతి చిల్కనా
చెన్నగు నూతనయౌవనము • చేఁ దనరారు సుధాకరాననన్
గ్రన్ననఁ గౌఁగిలించి వద • నంబు ముదంబున ముద్దుపెట్టుదున్
పన్నినవేడ్క మత్తమధు • పంబు సరోరుహ మానుకై వడిన్.

ఉ. మానిని విస్ఫురత్కమల • మంజులపత్ర విశాలలోచనం
బీనకఠోరతుంగ కుచ • భృంగగరుద్రుచి నీలవక్రి స
న్మానిత కోమలాలక స • మానవరాకృతి కామదేవతన్
దాని గుహూపదేశము వి • ధంబున ధ్యానముసేతు నాత్మలోన్.

మ. నెరివాల్చూఁపులు మొల్లక్రొవ్విరులకాం • తింజెందుఁబల్జాడ సుం
దరమై తేనెలు జిల్కు మోవిగల యా • తన్వంగి వక్త్రాబ్జమీ
ధరణిన్ సాధుపరోపకారము మదిన్ • దల్చుం గృతజ్ఞుం బలె
న్నరయ న్నామది మర్వ నిప్పటికి న • త్యంతానుభావుండనై.

ఉ. దీటు సెలంగఁ బంచశర • దివ్యధనుర్గతమత్తభృంగ రా
ట్కోటిగరుత్ప్రభారుచిర • కోమలకర్బురితాలకంబులం
దేటగు దంతపత్రముల • నీలసరోరుహ భూషణంబులన్
లూటిగ దాని మోము మది • లోఁ దలపోయుదు మాటిమాటికిన్.

శా. తెల్లంబై చిఱునవ్వువెన్నెలలచేఁ • దెల్పొప్పు లేఁ జెక్కులన్
మొల్లంబై తగు చంచరీకముల గో • ముంజెందు కన్దమ్ములం
బ్రొల్లీవాంక శరత్సుధాంశురుచి నొ • ప్పున్ భామ నెమ్మోము నా
యుల్లంబు జివురింప నిప్పటికి నే • నుప్పొంగి వీక్షించెదన్.

చ. దరము హసించు కంధరము • దారత నొంచి కరాంబుజాతముల్
వరకటి సంఘటించి జడ • వామభుజంబున గబ్బిగుబ్బ రా
న్నొరయ వహించి నిల్వఁబడి • యూరక నన్ను ననేకరీతులన్
వరమఖిఁ జూచు నత్తరుణి • వర్ణనచేసెద నే ముదంబునన్,

ఉ. నేనపరాధినై యడరి • నేర్పునఁ దత్పదపంకజంబులం
బూనికతోడుతం బడినఁ • బోవఁగఁ ద్రోచి చరించుచున్న య
ద్దానిచెరంగు వట్టిన ను దా • త్తత నిగ్గుకకోప మయ్యెడన్
మానకయున్నదాని వరమానిని నాత్మఁ దలఁతు నెంతయున్.

చ. సరిగాని నేల నేలు సువి • శాలనితంబము లొప్పుదాని, మే
ల్సరసులలోఁతుఁగాంచి బలు • సమ్మతముల్ గను నాభిదాని, మం
దరగతిఁ గల్గుదానిని, మృ • ణాళసమానవిలాసబాహువుల్
బరఁగినదాని నెన్నెదను • భావమునం దనుమధ్య నెప్పుడున్.

ఉ. అప్రతిమానబోధసుర • తాంతమునందు నిమీలితాక్షియై
కప్రపుఁదావి మాటికిఁ • గ్రమ్మఁగ నూర్పుల వేఁడి వాడిగం
దప్రరుచిన్ శ్రమాంబువులు • దార్కొని రాలఁగ నొప్పుదాని నే
న ప్రియురాలిమోము సుమనస్థితి • నిప్పటికిం దలంచెదన్.

ఉ. నాయెడ నొక్కమాటయు మ • నంబున భావనజేసి మాటికిన్
డాయక నంతరంగమున • డాపటిపట్టున కోపభావయై
యాయత బాష్పకంఠయయి • యప్పటియూర్పుల మోవి గ్రాఁగఁగా
జేయఁదొడంగె రోదనము • చింతనసేయుదు దాని నెంతయున్.

శా. ఏకాంతంబున నొక్కనాఁడు గృహమం • దెవ్వారు రాకుండఁగా
నాకంజేక్షణ దర్పణంబుఁ గొని పీ • ఠాసక్తి నుండంగ నే
జోక న్వెన్కవసింప మత్ప్రతినిధిం • జూచెంతయు న్సిగ్గుతో
వాకంపించి భ్రమించి మించె మదనో • ద్యన్మానసాంభోజయై.

చ. మఱియు సుగంధయుక్తమయి • మంజులమై తగుమోము దమ్మిపైఁ
దిటిగెడు గంధలుబ్ధమగు • తేఁటిగమిం గనుదోయి మాటికిం
దెఱచుచు మూయుచు న్మొగము • ద్రిప్పుచుఁ గేలిసరోహంబుచేఁ
దఱుముచు నొప్పు నప్పొలఁతి • ధ్యానముసేసెద నిట్టివేళలన్.

మ. ఒకనాఁ డొక్కెడ శ్రోణిపై వలువజా ♦ రుండంగ నేనంతలో
నకలంకస్థితిఁ జూచి సిగ్గుపడి యా ♦ హా యంచు దా విహ్వలాం
గకయై భీతిని నొక్కచేత మదనా ♦ గారంబు వేమూసి వే
రొకచేఁ జొక్కిలిఁ గప్పు నప్పడతి నే ♦ నూహించి ప్రార్థించెదన్.

చ. అటునిటు ముందువెన్క బహి ♦ రంతరసీమల నన్నిదిక్కులన్
స్ఫుటతర కాంచనాంబురుహ ♦ శోభితమంజుల సుందరాస్యయై
తటుకున వాలుజూపులను ♦ నా ననుఁ జూచుచు సంచరించు న
చ్చటులవిలోచన న్మదిని ♦ సన్నుతి సేసెద నేఁ బ్రియంబునన్.

శా. ఆకర్ణాంతములై మదాలసములై ♦ యబ్జోపమానంబులై
శ్రీకళ్యాణములై రమావసథసు ♦ ద్రేకంబులై మైందవా
స్తోకాంశుప్రతులై మధువ్రతవిభా ♦ శోభాయమానంబులై
యాకంజాక్షి విశాలనేత్రములు నా ♦ స్వాంతంబునం దొప్పెడున్.

చ. సమయ మెఱింగి నేఁ దలుపు ♦ చాటున నుండఁగఁ గేలుదమ్మిమో
హమున మొగంబునం దిడి మ ♦ దాగమనంబుఁ దలంచి చూచుచుం
గ్రమమున మత్కృతాంకపద ♦ కాండములన్ మృదుగీతిఁ బాడుచున్
రమణి మనోభిలాష యను ♦ రాజిలు దాని మదిన్ భజించెదన్.

చ. కలువలగేరు కన్నులకుఁ ♦ గాటుక రేఖలు దీర్చి, చెక్కులం
దలరఁగ జందనం బలఁది ♦ మోవయిఁ గస్తురి కొంత బూసి,
తిలకము దిద్ది, ముత్యముల ♦ దీటగు పాపటబొట్టమర్చి నా
యలికలవేణి ముద్దుమొగ ♦ మబ్బురగాఁ దలపోయు దెంతయున్.

మ. కొనగోళ్లన్ బిగిగుబ్బలొత్తి, కురులుం ♦ గూడంగఁ జేపట్టియున్,
మొనపంటం జిగురాకు మోవిఁ గొన మో ♦ మున్మాటి రోషాత్మయై
కనుదమ్ముల్ మగుడించి యస్సురని సీ ♦ త్కారంబు గావించుచున్
ననుఁ గోపించు వధూటి మోము మది స ♦ న్మానంబు గావించెదన్.

చ. స్మరజనకంబులై యమృత • సారములై శ్రుతిరంజనంబులై
యరయ మృదూత్తరంబులయి • యందములై మదికిం బ్రియంబులై
కెరలుచు నోష్ఠపుష్పపరి • కీర్ణశుచిస్మితసంయుతంబులై
పరగు నెలంతవాక్యములు • పట్టుగ శోభిలు నామనంబునన్.

చ. తనరఁగ నామదిం దరళ • తాలనిమీలితలోచనంబులై
యనుపమలిప్తచందనర • సాహితపాండురగండభాగమై
ఘనమృగనాభికాకుటిల • కల్పితపత్రలతాభిరామమై
యనువగు సుందరీమణి • ముఖాబ్జము నిల్పెద వేడ్కమీఱఁగన్.

చ. మఱియును గర్ణపాళిని స • మంచితకాంచనకుండలంబులున్
మెఱయఁగ గబ్బిగుబ్బ చను • మిట్టల ముత్యపుఁ బేర్లు రంజిలం
బిఱుఁదులఁ గాంచి యొప్ప ముఱి • పెంబున నందెలు మ్రోయవచ్చు
నా మెఱుఁగుమిటారి నెన్నెద సు • మీ మది నిప్పటికిన్ హితంబుగాన్.

ఉ. సందిటదోయి నామెడను • జక్కఁగ నిల్పుచు, నిక్కి మిన్నలై
యందములై చెలంగు తన • యుబ్బురపుబ్బు మెఱుంగు గుబ్బలం
బొందుగ నాయురంబునను • బూన్చి మొగంబున మోము జేర్చి న
న్నుం దగఁజూచు నెచ్చెలి • మనోహరమూర్తిఁ దలంచిచూచెదన్.

చ. కురులుభుజాగ్రభాగమునఁ • గూడి నటింప గళంబు లీలమై
యొరుగఁగఁ బెట్టి రైకబిగి • నొయ్యనఁ గాంతులు జీరువారఁగా
మెఱుఁగుమిటారి గుబ్బ లెల • మింగ గసుపట్టఁగ నన్నుజూచు న
గ్గరితమరాళదృష్టు లెదఁ • గాంక్షదలిర్పఁగఁ దేజరిల్లెదన్.

చ. అలరఁగఁ గోమలారుణక • రాంగుళముల్ దలపైఘటింపుచో
వలయముగా భుజాలతలులు • వాంచి దృఢాంగవివర్తనంబుల
న్వొలయుచు నుండఁగా నపరి • వేషసుధాకరకాంతినొప్పు న
ప్పొలఁతుకమోము నామదిని • బూని భజించెద వేడ్కమీఱఁగన్.

ఉ. తానొకనాఁటి వేకువను ♦ దల్పమునన్ శయనించియుండఁగా
నే నటలేచి తేపఁగను ♦ నిద్రితమి న్నవస నాకులత్వముం
బూనినరీతి నాదెసకుఁ ♦ బొల్పుగ మోమిడి కౌఁగిలించు న
మ్మానిని నాత్మ నిప్పటికి ♦ మర్వక నేను భజింతు నెప్పుడున్.

మ. చనుదోయిన్ మొగమ దు లేఁజెమటలున్ ♦ జాలంగురు ల్చెక్కులన్
దనరం దూలఁగ హారము ల్చెదరి యూ ♦ డంబై రతు ల్చేయుచోఁ
జనువొప్ప న్ననుఁగాంచి లేనగవుతో ♦ శ్వాసోక్తులు న్మాటికిన్
గొనబై పల్కు వధూటి నామదినిఁ గో ♦ ర్కు ల్మీఱ భావించెదన్.

మ. అలరుం బానుపుఁ బాసి వచ్చుటకు నే ♦ నత్యంతము న్వచ్చుటన్
వల పెచ్చుం దలపోసి కామనిక్రుతిన్ ♦ ద్వారంబు న్నిల్పి సం
చలనం బందుచు నెచ్చెలిం గదసి కాం ♦ క్షల్మీఱ నెగ్గెత్తి కో
కిలవాగ్వైఖరి రోదనంబు గను నా ♦ కేళీసతిం గాంచెదన్.

ఉ. ద్వారమున న్వసించి కడు ♦ దైన్యమున న్ననుఁజూచి చూచి న
ద్ద్వారతలంబునం బడి శు ♦ కాప్తిని డస్సియు నించుకంత ని
ద్రారతిఁ జెంది లేచి మది ♦ తల్లడిలం గల సత్కపోలయై
యూరయుచున్న యచ్చెలియ ♦ నాత్మభజించెద మాటిమాటికిన్.

మ. బలుయూర్పుల్ నిగుడంగ నేత్రయుగళి ♦ న్బాష్పాంబువుల్ రాల సం
చలతం జూచుచు నావిధం బడుగుచున్ ♦ స్వాంతంబు నానావిధం
బులఁ బోఁగా మదనుండు పైకొనఁగ మో ♦ మున్ వాంచి చింతించు న
బ్బలభిన్నీల శిలాకచన్ మదిని నే ♦ భావింతు నెల్లప్పుడున్.

ఉ. వేకువ నొక్కనాఁడు నిజ ♦ వేశ్మమున న్నెఱికొప్పు వీడఁగాఁ
గోకిలవాణియు న్మిషిత ♦ ఘూర్ణితదీర్ఘవిలోచనాబ్జయై
తేకువ నిద్రలేచి రుచి ♦ దేరఁగ నొక్కిన మోవి కేలిచే
నా కరగప్పుచాననను మ ♦ దాత్మను నిప్పటికిం దలంచెదన్.

చ. మఱియొకనాఁటి ప్రొద్దునను ♦ మానక బంచటరుంగుపైని దా
నిరవుగ నెచ్చెలిం గదిసి ♦ యింతిప్రియోక్తులు పల్కుచుండ నేఁ
బఱువున వచ్చి వెన్కఁగని నిలు ♦ వంబడినంతనె చూచి సిగ్గుతోఁ
జిఱునగ వొప్పఁబోవు వగఁ ♦ జిత్తమునం దలపోసి చూచెదన్.

మ. అపరాధం బొనరించి తీవనుచు న ♦ న్నత్యంతకోపంబుతో
నుపలాలింపక నెమ్మొగం బియక నో ♦ హో చాలుఁ జాలంచుఁ బో
నపుడు న్నేను బ్రియోక్తి నాముకొన న ♦ త్యాసక్తి లేనట్టి మా
ట పచారించిన నవ్వధూటిఁ గవుఁగి ♦ టం జేర్చి లాలించెదన్.

చ. పడుకొనిన యంతలోఁ బరి ♦ భావితమై వడిలేచి నిద్రచేఁ
దొడవడి యావలించి మెయి ♦ దొట్రువిదిర్చి విజృంభణక్రియం
బొడమిన మోమువాసనకుఁ ♦ బూని భ్రమించుచు నున్న తేంట్ల సం
దడికిఁ జలించునట్టి కను ♦ దమ్ములు గల్గినదాని నెన్నెదన్,

చ. మనసిజపూజ సేయ నిజ మానినులందరు గూడి కేళికా
వనమున కేగుచోఁ దనదు ♦ పార్శ్వమునన్ వసియించు నన్నుఁ జూ
చెనని శంకతోడ జను♦ లేమనుకొందురొ యంచు భీతియై
క్షణ మిటులుండు మంచుఁ గను ♦ సన్న యొనర్చినకన్నె నెన్నెదన్.

చ సరసిజనేత్రి తాఁ బ్రథమ ♦ సంగమవేళను సిగ్గుదోఁప నే
నరయుచు ధైర్యవృత్తిఁ గది♦యంగఁ దలంచినఁ జూచిఫూత్కృతుల్
నెరపఁగ నందు దీపశిఖ ♦ లీనతగంబము నొందు కర్ణభా
సుర కుసుమదంబుఁ గప్పు సతిఁ♦జూచెద నిప్పటికిన్ ముదంబునన్.

చ. చెలి తమితోడ నెచ్చెలుల ♦ సీయని కోపము సేసి శీఘ్రతం
దలతల మామఁ జోఁగదిమి ♦ తత్పరతం బులకల్ జనింపఁగా
నలరుచు సంస్మితాస్యయయి ♦ యంతట నాదెసవచ్చి కూటమిన్
గలసినభామినీమణిని ♦ గాంచెదఁ గన్నుల కర్వుదీఱఁగన్.

మ. కలకంఠోపమకంఠ నాస్యజితరా • కాచంద్రబింబ న్మయూ
ర లసద్బర్హసిమానవేణి సుగుణ • వ్రాతాత్మనేత్రప్రిభా
విలసన్మత్తచకోరయానవిజిత • శ్వేతచ్ఛదం గాంచనో
జ్జ్వలకుంభ స్తనిఁ గామినీమణిని నే • భావింతు నెల్లప్పుడున్.

మ. విరిశయ్యం బవళించి మన్మథసుదా • విర్భూతి కాంగంబులన్
సరిగావింపుచుఁ గౌఁగిలించి ముదమె • చ్చన్నాదు కెమ్మోవి సుం
దరవక్త్రింబున నిల్పి సురతసం • ధానంబుఁ గల్పించు శం
బరవిద్విడ్ధ్వజవై జయంతి మది నం• భావించి ప్రార్థించెదన్.

ఉ. సిబ్బెంపుగబ్బిచన్నుఁగవ• చెన్నుగ నిక్కఁగ నక్కళించి యం
దబ్బురపాటు గన్పడఁగ • నంగ విభంగ మిషంబునన్ రుచుల్
గుబ్బతిలంగ బాహులత•లుం బయికెత్తి గభీరనాభి పె
ల్లుబ్బిన వేడ్కఁ జూపుచెలి• నుల్లమునం దలపోసి చూచెదన్.

చ. వరుస వివర్తితంబులయి• వాలిలు నపాంగ •విలోకనంబులన్
మరుదశనోపమానమృదు• మంజులసుందర భాషణంబులన్
దరమధురస్మితంబులను • దాళిమి యానములన్ విలాసతన్
సిరు లెసఁగంగ నొప్పుచెలి• చేష్టలు నామది సంస్మరించెదన్.

చ. కనుఁగవ యించుకంత నెటి•గానొనరించి సరత్న పాళికం
కణముల ఝుంకృతిధ్వనులు • గౌరవమొప్పఁగఁ జన్నుదోయి
క్కను గనుబొమ్మలెత్తి నిజ•కైశ్యము చక్కఁగ మెచ్చొనర్చు మా
నినిఁ బలుమారు నిప్పటికి • నేమదిలోన భజింతు నెఱయున్.

చ. అరయ సహింపరాని విరహా • ర్తి నిజెందినదై రయంబునన్
సురతవిశేషసంగతులఁ • జొక్కపుతాండవ సూత్రధారియై
తరమిడి యంగమంగమును • దాఁకఁగ. గౌఁగిటఁ బట్టి కన్నుదో
యరయిడి చెక్కు నొక్కసతి• నాత్మభజించెదఁ గోర్కెమీఱఁగన్.

చ. విలసితమన్మథన్ విరహ • విహ్వలలాసగాత్రి సుందరిన్
లలితకురంగనేత్రి సువి • లాసరసాంచితచారుకాంచనో
జ్జ్వలమహనీయచేలయుత • శ్యామవిరాజితహంసయాన నే
నలవడ సంస్మరించెద న • నారతముగ్ మదిలోన వేడుకన్.

ఉ. మలయగిరిప్రభూతపవ • మానములంగని తీవరాడఁగా
నలలితరత్నవేదిపయిఁ • జక్కఁగఁ దా వసియించి గీతముల్
దలకొని వీణ సుస్వరయు • తంబుగఁ బాడుచు నాళిపాళికిన్
లతి నయనోత్సవం బొసఁగు • లక్షణగాత్రిని నేభజించెదన్.

—• వీరసేనుండు కవి రచించు పద్యంబుల రాజునకు బంపుట •—

వ. అని యిబ్లుకవివరుండు మదనోన్మాదంబునయామినీపూర్ణతిలకాయత్త చిత్తుండై తద్వర్ణనాతివిశేషంబులుగా రచించిన పద్యంబులు యశఃప్రి తంబునఁ దద్భృత్యులు భూపాలునికప్పటప్పటి కర్పించినంజూచిచూచి యంతకంతకు గోపాటోపంబునఁ గనరివేయుచున్న విసికి విసికి తద్వృ త్తాంతంబంతయుఁ గవివరుండు విన వీరసేనున కిట్లనిరి.

చ. హిమరుచి నక్కళావిభవుఁ • డీకవిరాజు రచించునట్టి ప
ద్యములు గ్రహించి రాజునకు • నర్పణచేసినఁ జూచి కోపభా
వమున దురుక్తులంబలికి • వారకఁ బొమ్మనుఁగాని మంచిమా
టమరఁగఁ బల్కఁ డప్పుడు త • దాగ్రహవృత్తి వచింప శక్యమే.

చ. అనవుడు వీరసేనుఁడు ద • దాననముం గని యోకవీంద్ర నీ
వనఘుఁడ విందిరావరసు • తాభుఁడవు న్నిను హింససేయఁగా
మనమున నక్కపామతిని • మానితిఁ బూనితి నేభరింపఁగాఁ
బనివడి వ్రాయు పద్యములు • పార్థివుఁ డొప్పఁ డిదేమి సెప్పుదున్.

చ. అనవుడు భూసురుండు హృదయాబ్జమునం గడు నవ్వి యోరి! ని
న్ననయము మెచ్చితిన్ విను ధ • రాధిపుమానసముం గరంగు నే
పనివడి యేలఁ బంపితివి , పాల్పడి నాకని బ్రహ్మదేవుఁ డి
ట్లను లిఖయించియుండ వెత • లంబడఁ గారణమేటి చూడఁగన్.

ఉ. ఓరి తలారి వీరి మఱి • యూరక త్రిప్పకు మేమి త్రిప్పఁగా
సారము, ఖడ్గముంగొని వి • చారము సేయకు త్రుంచుమన్నఁ ద
ద్ధీరతఁగాంచి వాఁడు క్షితి • దేవకులోత్తమ! యేతదర్థమై
యారయఁజాల దెంతపని • కైన భరింపుదు నిన్ను నెన్నఁగన్.

క. ఏమేమి వ్రాసితివో యా
భూమీపతి మానసంబు • పొరలకపోయెన్
సామీ! యీమాటైనను
నామోదత మంచిపద్య • మానతియిమ్మా.

సీ. తనపృథ్వి యాఘనా • ఘనశ్రేణి చరియించు
క్షితిభాగమున నుండఁ • జేయుమయ్య,
తనరసం బాసుధా • ధరక్రీడలాడెడు
శృంగారసరసిలోఁ • జేర్చుమయ్య,
తనతేజ మాతప్త • కనకాంగి దర్శించు
దర్పణాంతరమునఁ • దార్చుమయ్య,
తనవాయు వాసుగం• ధశ్వాస విసరించు
కొను వ్యజనంబునఁ • గూర్చుమయ్య,
తే. తననభం బారమణియింట•ననుపుమయ్య
యాశరీరంబు పంచత్వ • మెనసినపుడు
స్వాంశములతోడ భూతంబు• లైదు నైదుఁ
గూర్పుమయ్య విధాత! నా • కోర్కెదీర.

వ. అని యిట్లు కమలభవుని వేడి త్రికరణపూర్వకంబుగ నమస్కరించి నిలువంబడియున్న వీరసేనుఁడు తత్పద్యంబు గ్రహించుకొని రాజ సమీపంబునకువచ్చి తత్పత్రిక సమర్పించిన.

క. ఇదియేమి మాటిమాటికి
హృదయంబున లేదె భీతి • యెంతయు నన, వాఁ
డదరక సామీ భూవర!
యిది చూడుఁడు యొక్కవింత • యేమో తలఁపన్.

వ. అనిన లిఖితంబుఁ గైకొని పద్యంబుఁ జదువుకొని యయ్యర్థం బనే కార్థంబులుగాఁ దోఁచినఁ గొంతతడ వాలోచించి యిట్లనియె.

క. ఓరి దురాత్మక! యిఁక పలు
మారిటు రావలదు, హెచ్చి • మఱి వచ్చితివా
నేరముగొందు గ్రహించుక
నూరక యాపని ఘటింపు • మెప్పుడు నాకున్.

ఆ. అన నిరాశుఁ డగుచు • నావీరసేనుఁడు
వచ్చిపలికె విప్రు • వరునితోఁడ
నేమి వ్రాసినావొ • యెఱుఁగ నింతైన,
మనసు గరుగదయ్యె • మనుజపతికి.

మ. అని పల్కం దలయూచి యూచి మది నాహా యంచు నేసాహసం
బునఁ జాతుర్య మెలర్పఁగాఁ దనగతిన్ • భూమీశు నుచ్చాయయుం
గని రెండొక్కటియైన మంచిదగుఁగా • కాయంచు నిశ్శంకుఁడై
కని యూహించె శరప్రయోగమయి తా • కం బద్య ముద్యద్గతిన్.

— • కవి రాజుకోపశాంతికరంబైన యొకపద్యము వ్రాసిపంపుట • —

చ. రవిజుఁడు భాగుణింప విఘు • రంబుగ భట్టి నశించె భారవి
ప్రవరుఁ డడంగె దీర్ఘమునఁ బ్రాణముఁ బాసె గుడియ్య భిక్షుఁడీ

యవనికిఁ దప్పె భీముఁడు దఁ • దంతగతి న్మఱి కొమ్ము వెట్ట నీ
క్కువముగ వేఖకుందుఁ డను • కొమ్మన దీర్ఘము వెట్టకుండఁడీ
భువి నతఁ డెన్న నిర్దయుఁడు • భూపతి వీవుఁ దలంప భూవరా.

వ. అని పద్యంబు లిఖియించి వీరసేనున కిట్లనియె.

క. ఓపుణ్యాత్మక వినుమా!
యీపద్యముచే గ్రహించి • యెంతయు జని నీ
వేపున నొసఁగిన వే యా
భూపతి ననుఁ బిల్వనంపుఁ • బొమ్ము రయమునన్.

వ. అని చెప్పిన నప్పద్యంబు గ్రహించుకొనిపోయి రాజు ముందరం బెట్టిన నప్పత్రిక దండధరాళిపుత్రికవిధంబున మదికిం దోఁపం జూచి తదర్థంబు గ్రహించి మహీవల్లభుండు పవనోత్కంపితకదళికామహీరుహంబు చందంబునఁ గంపితసర్వావయవుండై యెంతయుం బొద్దు చింతించి తదుభయదృఢతరస్నేహసారంబులును, తత్కవీయమహాత్వంబును విచారించి వానితో నిట్లనియె.

— • రాజు కవిరాజుం బిలువఁబంపి పుత్రి నూరడించుట • —

క. ఓవీరసేన! యిచటికి
వేవేగం దోడితెమ్ము • బిల్హణు ననినన్
భావము రంజిలవాఁడు ధ
రావిభునకు మ్రొక్కి వచ్చి • రాసుత కనియెన్.

క. ఓతల్లి! నీమనోహరు
నాతతహృదయాంతరంగుఁ • డై వసుధీశుం
డీదరిఁ దోడుకరమ్మనె,
నీతవము మానుమింక • నీరజనయనా!

వ. అనిన విని గ్రీష్మసమయదందహ్యమానమానసయై మయూరిక ఘనాఘనగర్జానినాదంబు వినిన చందంబున సుందరీమణి తద్వచనంబులు విని కుతూహలచిత్తయై కంఠహారం బొసంగిన గ్రహించుకొని బిల్హణున కిట్లనియె.

ఉ. ఓకవిరాజశేఖర! మ • హోన్నతి నీవు రచించు పద్యముం
దేఁకువతోడ నానరప • తిం గని యిచ్చినఁ జూచి యెంతయుం
గైకొని దాని యర్థమును • గాంక్ష దలిర్పఁ గ్రహించి యువ్వాడ
స్తోక జవంబుమీఱ నినుఁ • దోడ్కొనిరమ్మనె నయ్యెలిమెన్వడక్.

వ. అని యత్యాదరంబున శుభలక్షణపరిశస్తంబగు స్వీనతని హస్తంబుఁ బట్టుకొని వచ్చునెడ.

తే. రాజరాజగు మదనాభి • రామనృపతి,
తనకుమారినిఁ దలఁచి యా • స్థానమెడలి
వచ్చి తద్వారమందున్న • వనజపత్రి
నేత్రి దగ్గరఁజేరి క • న్నీరుఁదుడిచి,

తే. శిరము మూర్కొని చికురముల్ • సిక్కువాపి,
చక్కగానిడి గద్గద • స్వరముతోడ
ననియె దయమీఱ భూపాలుఁ • డాత్మజాత
కమ్మ! సంతాపమును మాను•మమ్మ! యనుచు.

క. ఓకూర్మితనయ! కవివరు,
నీకోరిక మీఱఁగూర్తు • నిశ్చలమతివై
నాకడకును రావమ్మా!
యీకడ నాచేయుపని గ్రహింపుము మదిలోన్.

—: రాజు కవివరు నెదురుగాఁ జని తోడ్కొనివచ్చుట :—

వ. అని యుపలాలించి యంతఃపురంబున కనిచి బిల్హణునకు నెదురుగాఁ జని నమస్కరణపూర్వకంబుగఁ గౌఁగిలించి చతురంగయానంబున నధివసింపంజేసి సభామంటపంబునకుం దోడ్కొనివచ్చి యుచితాసనంబునం గూర్చుండ నియమించి సభాసదులు విన నృపవరుం డతని కిట్లనియె.

ఉ. ఓచతురాననాన్వయ! మ హోదధిపూర్ణశశాంక బిల్హణా
ఖ్యా! చతురాస్య! నీమహిమఁ గన్గొన నెరికి శక్యమౌ ధరన్?
నీచతురోక్తివైఖరికి నీదృఢవృత్తికి, నీకవిత్వధా
రాచలితైకనిష్ఠకు న హర్నిశమున్ మది నేను మెచ్చితిన్.

—: రాజు కవివరు నూరడించి తనకూఁతుం బెండ్లిగమ్మనుట :—

చ. తడఁబడి యెవ్వఁడేఁ యుఁ గృ తఘ్నునియం దొనరించు మేలుకై
వడిని మదీయకృత్రిమము భవ్యగుణాకర! నీమనంబునం
దడవక సుందరీమణివ తంసము నాతనయన్ వరించి యే
ర్పడ నయ మొప్ప మత్సుతకు భర్తవుఁ గమ్మని పల్కె వెండియున్.

క. రేపు సమస్తంబగుఁగా
నీపాద్రిర్దు బడలినావు హితమతితో నీ
వీపట్ల నేఁడదేఱుము,
భూపాలసుతైకచర్య భూసురవర్యా!

వ. అని యొడంబఱిచి కవివరు యథాస్థానంబున కనిచి వసంతాఖ్యున కిట్లనియె.

క. ఓమంత్రివర్య! చూచితె
భూమీసుర చిత్తవృత్తి • బోధింపంగా
నేమందు, నెంతదృఢ మా
భామామణి హృదయ మట్లు • పరిశీలింపన్?

క. ఈవిధమున నిర్వ్యరకున్
దైవాజ్ఞన్ ఘటనమయ్యెఁ • దప్పింపంగా
నావశమె? యగ్రజన్ముఁడు-
భావింపఁగఁ, గూతు నిత్తు • భవ్యవిచారా!

వ. అనిన విని మంత్రివరుండును సభాసదులును నేతత్కార్యంబు విశేష కార్యం బనిన విని వారలం బనిచి యంతఃపురంబునఁ బ్రవేశించి పరిచారికాజనంబులం బిలిపించి యిట్లనియె.

క. ఓ కాంతలార! మత్సుత
కాకవివర్యునకు భోజ • నాదులు పూర్వం
బేకొలఁది విచారించితి
రాకొలఁదిం జేయుఁడనుచు • ననిచి రయమునన్.

వ. తనదార యగు మందారమాలిక కాచందం బంతయుం జెప్పి యాయమకానందం బాపాదించి భోజనాది కృత్యంబులు దీర్చి సుఖంబుండు నంత.

—• ప్రాతఃకాలాభివర్ణనము. •—

చ. తెలతెలవారెఁ దూర్పు, నలు• దిక్కులవిచ్చెఁ దమంబు, పక్షులం
గలకలఁబల్కెఁ, గోకములు • గాంచె ముదంబు, లుడుప్రజంబు ఖ
స్థలమున నాశకాడకును • జాఱెఁ, జెలంగి పదాయుధంబు లు
గ్గలగతి మ్రోసె, వీచె వలి • గాడ్పులు, భూజను లుల్లసిల్లఁగన్.

సీ. కోకాంగనా గణ శోకమారుత మిత్ర
ఘనతరజ్వాలలం గందినాఁడొ
విరహదుస్సహవధూ విపులనిశ్వసనోష్ణ
గంధవాహములచేఁ గమలినాఁడొ
బాధితపద్మినీ పటల శుకసంప్రాప్త
ఘోరపాపంబునఁ గుందినాఁడొ
జనదూరితాప్రాప్త జారచోరవ్రాత
శాపంబులను గొంత సమసినాఁడొ

తే. యనఁగ దోషాకరుండు కళానుభూతి
దొరఁగి వెన్నెలపులుఁగుల దొడరి యితఁడు
రేపు నేవేల కొదవునో మాపనేమి
యనుచు నీఁక సారమంత కొల్లాడసరిగె.

ఉ. వెన్నెలతీవలం దడఁగి వెల్వడి విస్ఫురసారసావళిం
గ్రన్నన సౌరభంబుఁగొసి రాజిలు గంధసమీరణంబు ల
భ్యున్నతసౌధరాజములఁ బుష్పశరాసనకేళిఁ దేలి యం
దున్న వధూశ్రమాంబుతతు లొప్పులు మీఱ హరించు నెంతయున్

మ. ముద మొప్పారఁగఁ బద్మినీమణులు మో ముల్విప్పఁ జక్రింబు ల
భ్యుదయం బొందఁబదాళులున్ సరసవి స్ఫూర్తిం బ్రవర్తిల్ల నా
స్పదమై భాసిలు పుష్పదంతగజరా జం బెక్కి యుద్యద్ద్విజుల్
మది రంజిల్లఁగ సన్నుతింప వొలసెస్ మందాలునిం డత్తరిన్.

మ. మలయాహార్యతటంబు డిగ్గి విలస న్మల్లీమతల్లీలతా
వళులఁ జిక్కి ప్రయాసత న్వడలి దీ వ్యచ్ఛారుకాసారని
ర్మలతోయంబుల నీఁది పంకరుహసౌ రభ్యంబుఁగొల్లాడి ప
క్షులనాదంబులతోఁ జరించు మరుదం కూరంబు లవ్వేళలన్.

క. తనతమ్ముల వైభవమునుఁ
గొనెనఁట యొకరాజు వానిఁ • గొట్టెద ననుచున్
ఘనకోపుఁ డయ్యె ననఁగా-
నినుఁ డతితేజం బెసంగ • నేతెంచె నొగిన్.

మ. హరిచక్రంబు భరించు నుద్భటనిశా • టాటోపముల్ మాన్పి యు
ద్ధురలీలాప్తి బుధాంతవర్తి యయి యొం• తోఁ బూర్వదేశంబు భా
సురమై యొప్పఁగ నిండు నంద నిలిపెన్• స్తోత్రార్హుఁడేయంచు శం
కర పద్మోద్భవులుల్ భజింపఁ జెలఁగెన్ • గాలోచితాచారుఁడై.

ఉ. అంగుగఁ గాలమన్కరిన్• నావల నీవల వ్రేలు బంధురా
భంగురపాశము ల్మైలయు • బంగరుపోసినఘంటలో యనన్
సంగతి మీఱఁ బ్రాక్పరము • శైలములం గనుపట్టి రర్కసా
రంగధరుల్ నిజోర్ధ్వరుచు • లందము నొందఁగ నట్టివేసవన్.

క. హితవిబుధస్తుతిగోత్రా
హితకరుఁ డుదయించె గురుబు • ధేశ హితుండై
ధృతిపూర్వదేశముం గొని
క్రతువులు గోతలమునందుఁ • గడు నొప్పారన్.

సీ. అతుల ద్విజాలోక • నావహుండై త్రయా
సుముఖుండై నట్టి తే • జోమయుండు
కమలామనోహరా • కారుఁడై శర్వరీ
చరుల నొంచిన చక్రి • భరణశాలి
యఖిలలోక తమోప • హరణ నైపుణవృత్తి
రాజిల్లునట్టి స • ర్వజ్ఞవిభుఁడు
మిత్రుఁడై భువన ప • విత్రకుండై తగ
ధరవెలిఁగించు స • న్మార్గవర్తి

తే. యాదిమూర్తియనంగఁ బ ◆ ద్మాత్ముఁడనఁగ
నార్తితార్యుఁడనంగ ది ◆ వ్యైకవాక్స్త
వముల ద్విజరాజసంగతి ◆ వసుమతీంద్ర
శేఖరారూఢతను రవి ◆ చెలఁగె నెదుట.

తే. అలరుతమ్ముల నొకటి దా ◆ నాత్మఁదలఁచి,
దిశలు జెలువొందఁ దమము భే ◆ దించి తనదు
లోకబాంధవవిఖ్యాతి ◆ లోకు లెన్నఁ
గరము వెలుఁగంగఁ బద్మినీ ◆ కాంతుఁ డలరె.

క. ఉరు కువలయంబు బెగడఁగ,
ఖరకరుఁడు జనించి రాగఁ ◆ గలుఁగు సదాళిన్
వరుసఁగని రూపు మాపఁగ
నరిగెను ద్విజరాజు పశ్చి ◆ మాంబుధి కడకున్.

చ. సమయకిరాతకుం డుదధి ◆ జాడల వచ్చుచుఁ జేరి పూర్వది
గ్రిమణికి విక్రయించుదయ ◆ రాగపు వన్నెపటంబు లిచ్చి చూ
పె మదికి హర్షమైనయది ◆ బేరములాడి నిబద్ధమైన ని
ష్కము నొకటిచ్చెనో యనఁగఁ ◆ జాయలు దోఁపనినుండుఁ జెల్వుగన్.

తే. ఒక్కయినుఁ డంత కంతకు ◆ నుక్కుమిగుల
నొక్కరాజది జూడంగ ◆ నోర్వలేక
డిందివెల్వెలనై యొక్క ◆ దిక్కునేరె
ననఁగ సూర్యుండు హెచ్చె, హి ◆ మాంశుఁ డడఁగె.

చ. సమయవినోది మిన్ననెడి ◆ చక్కని రంగమునందు సర్వది
గ్రామణులు చూడఁగా దృఢము ◆ రక్తినిఁ జూప విధుం డనెండు న
ద్దము నొకకర్ణమం దునిచి ◆ దాపలికర్ణమునందు హేమచ
క్రిము వెడలంగఁ దీసె ననఁ ◆ గా రవి దోఁచెఁ బ్రభాప్రభావుఁడై.

— భూపాలుఁడు తనకూతుఁను గవి కిచ్చి పెండ్లి
సేయ సన్నాహము జేయుట. —

వ. ఆసమయంబున మంగళతూర్యనాదంబులు వినుచు మేల్కని మద నాభిరామ భూమిధవుండు స్నాన సంధ్యాద్యనుష్ఠానంబుల నిర్వర్తించి సముచితాలంకారుఁడై సభాస్థలంబునకు వచ్చి, మంత్రి పురోహితా మాత్య బంధువిద్వజ్జనంబుల రావించి, వారల నుచితాసనంబుల గూర్చుండ నియమించి సుప్రసన్నుండై యిట్లనియె.

క. ఘనులార బిల్హణాఖ్యున
కెనయఁగ మామకకుమారి ♦ నిచ్చెద నని నే
మనమునఁ దలఁచితి నిపుఁడు ద
దనుకూలము బ్రహ్మ పూర్వ ♦ మందె ఘటించెన్.

వ. అని యిట్లు పలికి వారలయనుమతంబున ముహూర్తము నిశ్చయం బు సేయఁదలంచి జ్యోతిశ్శాస్త్రకోవిదులఁ బిలిపించి యడిగిన వార లిట్లనిరి.

క. గురుకవి యుక్తి నినుండున్
వరుస నమందాత్ముఁడగుచు ♦ వసుధఁ బరగినం
బరికింపఁగ ద్విజరాజుకు
చిరతరముగ మంగళాప్తి ♦ చెన్నగు వేడ్కన్.

తే. నీకుమారిక యళియయ్యె ♦ నాకవీంద్రుఁ
డలర ధనువయ్యె నిర్వైర ♦ కనుగుణంబు
గ్రహవిరోధంబు నెందులఁ ♦ గానఁబడదు
రాజబల మొప్పుతా ♦ రాబలంబు.

క. ఈకన్య కిపుడు ద్విజ నా,
జాకడ నాటింటఁ జెల్వ॰ మలరిన వాఁడై
చేకొని పదిఁటను మితప్రీత
శ్రీకరముగ నొప్పు నతను ॰ సిద్ధినృపాలా.

వ. అని యిట్లు పలికిన సంతుష్టాంతరంగుఁడై నృపపుంగవుండు నిజనగరం బలంకరింపఁ జేయుండని పరిచారకులం బంచిన.

సీ. పచ్చలతోరణ పంక్తులు ఘటియించి
కస్తూరిపూఁతలు ॰ గా నొనర్చి
మలయజపంకంబుఁ ॰ జిలికి జవ్వాది రే
కులు దీర్చి రత్న వే ॰ దులు నమర్చి
ముత్యాల నవరంగ ॰ ములరంగు గావించి
నవవజ్రమయ సిం హా ॰ నములు నెఱపి
వాసితాగరుధూప ॰ వాసనల్ నిగుడించి
పగడాల మెఱయు చ ॰ ప్పరము లునిచి

తే. ప్రతిగృహంబుల భ ర్తృకుం ॰ భములు నిలిపి
దర్పణంబుల ద్వారబం॰ ధములు గూర్చి
ధవళసౌధాళిఁ జిత్రకే ॰ తనము లెత్తి
పురము శోభిల్లఁజేసి ర ॰ బ్బురము గాఁగ.

సీ. ఏవీధి జూచిన॰ నిఁపుమై మంగళ
తూర్యనాదములు సం ॰ తోష మెసఁగ

నేచాయఁ గాంచిన ◆ హితముగాఁ జెవులకు
వీణారవంబులు ◆ వేడ్కసేయు
నేపట్టఁగనిన భే ◆ రీపటహాదికా
హాళమృదంగైకవా ◆ ద్యములు నెనయ
నేచోటువీక్షింప ◆ వాచాచమత్కృతిఁ
బాటలు నాటలుఁ ◆ బరిఢవిల్ల

తే. నొప్పు నక్షత్రవల్లభా ◆ భ్యుదయమునకుఁ
జెలఁగి మిన్నంది యుబ్బిన ◆ జలధికరణిఁ
దనరుఁ గవిరాజ ◆ శుభమహోత్స ◆ వమునకును
నగరరాజంబు సంతతా ◆ నందమొంద.

క. అత్తటి నఁగన లారతు
లెత్తఁగ ధవళములువాడ ◆ నింపు దలిర్పం
గ్రొత్త గనుపింపఁ బెండిలి
చిత్తరు చవికె కరుదెంచె◆ క్షితిసురుం డెలమిన్.

సీ. ఈపద్మనిభవంశు ◆ కెనయంగ నలుఁగిడ
నేర్తువు పద్మిని ◆ నీవు రావె,
యీకళానిధిఁ జేరి ◆ యెలమి సేవలుసేయ
నేర్తువు మృదుహస్త ◆ నీవు రావె,
యీచతురాస్యుతో ◆ నింపుమై బలుకంగ
నేర్తువు శుభవాణి ◆ నీవు రావె,
యీమహాసర్వజ్ఞు ◆ కిరవొంద శిరసంట
నేర్తువు శశిరేఖ ◆ నీవు రావె,

తే. యనుచుఁ దమలోన భూమిపా • లానుమతిని
సరసనల్లాప వచనర • చనలు దెలుప
నంగనారత్నములు గొంద • ఱాసువర్ణ
గాత్రుఁ గదియుచుఁ బాడిరి • ఘనులు మెచ్చ.

క. మంగళము రాజసుతునకు,
మంగళ మంబుజముఖీ ర • మాతనయునకున్,
మంగళము శాస్త్రవేదికి,
మంగళము కవీంద్రమౌళి • మణికి సుగుణికిన్.

వ. అనుచు నారతిపాటలు పాడి శిరంబున సకుత లునిచి.

చ. నడు మసియాడఁ జన్నుఁగవ • నాట్యము సల్పఁగ రత్నహారముల్
దడఁబడి డోలికాకలనఁ • దార్కొన వేణి చలింప నెమ్మొగం
బాడలును జెక్కుటద్దములు • నొయ్యఁ జెమర్పఁగఁ గంకణంబు లే
ర్పడి రవ మూప్పతిల్ల నొక • భామ తలంటెఁ గవీంద్రమౌళికిన్.

తే. గందమటకలితలఁ బులి • మందమైన
బంగరుకటాహములోనఁ • బొంగుజలము
బొట్లుగావించి బిందియ • ల్పట్టి యొక్క
యతివ సుకవికి మజ్జనం • బార్చెనపుడు.

సీ. తడియార్చి వలువ లే • ర్పడ నిచ్చె నొకలేమ
యెదుట పావా లుంచె • నొక్కభామ
పువ్వులు సిగఁ జుట్టెఁ • బొలుపొంద నొకకొమ్మ
మురువులునిడె నొక్క • ముద్దుగుమ్మ

కస్తూరితిలకంబు ॰ ఘటియించె నొక్కజాణ
యొడల గంధ మలందె॰ నొక్కచాన
చౌకట్లపోగులు ॰ సవరించె నొకబాల
యురుహారములు బూన్చె ॰ నొక్కగోల

తే. పడఁతి రత్నపు టుంగరాల్ ॰ దొడిగె నొకతె,
వెలఁది కపురంపుసురటిచే ॰ విసరె నొకతె,
నిలువుటద్దంబు ముందర ॰ నిలిపె నొక్క
మగువ బిల్వాణకవిశిఖా ॰ మణికి నపుడు.

క. ఈరీతిఁ గవినిఁ జెలు విం
పారఁగఁ గయిసేసి నృపవ ॰ రాత్మజ కెంతో
నీరాట మొనర్చియు శృం
గారించిరి వేడ్కబొడమ ॰ గ్రక్కున నంతన్.

క. సరిగంచు చీర కట్టి పై
నెరయంగాఁ గట్టి తైక ॰ నీలై మెఱయన్
సరిగుబ్బలు గుబ్బతిలం
గరముగ సవరించు పైఁట ॰ గావించి రొగిన్.

క. సికఁజిక్కువారసేయని
చికురంబులు చిక్కుదీర్ప ॰ చెలువుగఁ గీల్గం
టొకయింతి వెట్టి నవ్వుచు,
సఖి ముడి బాగుపడె ననుచు ॰ సన్నుతిఁ జేసెన్.

తే. సూర్యచంద్రులు మైత్రిచే ♦ సుదతి వదన
వనజమంతయు సంతత ♦ వైభవంబు
నందఁ జేయ వసించిరో ♦ యనఁగ నపుడు
సూర్యచంద్రిల నిడె నొక్క ♦ శోభనాంగి.

ఉ. కోరిక నాకలింగొని చ ♦ కోరకులుల్ జన ముప్పతిల్లఁగా
సారసవైరి యం దమృత ♦ సారము దూఱుచుఁదోసె తద్గతం
బై రహిమించు నల్పుగొన ♦ నత్తఱిఁ జారె ననంగ నొక్క సిం
గారపుబొమ్మ వాలుదెలి ♦ కన్నులఁ గాటుకదీర్చె బోఁటికిన్.

తే. తారకావళిసేవ్యమై ♦ తనరునట్టి
చంద్రబింబంబుతోడుత ♦ సాటిసేయుఁ
జెలువ మోమునఁ గస్తూరి ♦ తిలక ముంచి,
ముత్తెములచేరు లమరించె ♦ ముదితయొకతె.

క. అద్దములవంటి చెక్కుల
నిద్దపురుచు లుప్పతిల్ల ♦ నీటుక శ్రుతులన్
ముద్దులగుమ్మకు నొకతె,
ముద్దియ కుండలము లునిచె ♦ ముద్దులుగారన్.

క. సంగతిగ మోవిచివిఁ జూ
డంగసి యరుదెంచె ననఁగఁ ♦ దార్కొను నాసన్
రంగలర నాణిముత్తెపు
ముంగరఁ గీలించె నొకతె ♦ ముదితామణికిన్.

క. దరము వివరం బెఱింగియు,
వరుసం దనజన్మసీమ • వారిని వేడ్కన్
భరియించె ననఁగ నొక్కతె,
యురుపుచ మెడ ముత్తెసరులు • నునిచెం బ్రేమన్.

క. స్ఫుటముగ నీయుత్సవమునఁ
గటకంబులు మ్రోసె ననుచు • ఘనమణి భాస్వ
త్కటకమ్ము లునిచె నొక్కతె
కుటిలాలక కరములందుఁ • గోమరు సెలంగన్.

క. పిరుదులు ధరగాని దీవులు
నిరవొందఁగ నాక్రమించి • యేర్పడె ననుచున్
బిరు దుంచినగతి నొక్కతె
గొరయగ రత్నములకాంచి • యునిచెం జెలికిన్.

క. కరిగమననడలు మదనుని
కరిగతులన్ ధిక్కరింపఁ • గలవని యందెల్
సరిమ్రోయఁగఁ జరణంబుల
నరుదాఁగ నిలిపె నొక్క • యతివ ముదమునన్.

క. ఈవిధమున రమణీమణు
లావసుధావరునిపుత్రి • కంచితలీలన్
వేవేగ నలంకారము
గావించి వివాహవేది • కడ నిల్పుటయున్.

సీ. పతివీక్షణములు ర • సప్రవర్తకములై
నెమ్మోముదమ్మిపైఁ • గ్రమ్మికొనఁగ
బిసరుహేక్షణదృష్టు • లును మనోహరములై
గళసుగంధివిశేష • కలనఁ బొదలఁ
దరుణాంగి చూపుల • త్తతి శిలీముఖములై
హృదయపంకజ మావ • హించి నాట
భామినీలోచన • ప్రభలు వరాళులై
తనరారు పాద • పద్మముల వ్రాలఁ

తే. బరగి కవిరాజు పూర్వ • వైఖరిని మోహ
కలితవిభ్రమవిస్మయా • క్రాంతుఁడగుచు
ననితరాయత్తచిత్తుఁడై • యాత్మలోనఁ
జెలువభావంబుగాంచి వీ • క్షింపుచుండె.

సీ. ఈశ్వరమంగళ • యీక్షణకాంతుని
భరితసుధాకర • ప్రభలుగాఁగ
నీశ్యామ కన్దోయి • నింపాఱు దీప్తులు
పూసిన రతికాంతు • భూతిగాఁగ
నీనతి కన్నుల • భాసిలు దీధితుల్
పొలుపొందఁ దమ్ముల • పూజగాఁగ
నీయార్య లోచన • చాయలు మాళిపైఁ
బ్రవహించు గంగాఝు • రంబుగాఁగఁ

తే. బరగు కవిరాజమౌళి స • ర్వజ్ఞమూర్తి,
విలసదసమాంకస్ఫూర్తి • విశదకీర్తి,
యంచితాచలభోగభా • గ్యైకమూర్తి,
యనుచు నచ్చటి విబుధాళి • యభినుతింప.

సీ. భావిఫలోదయ • ప్రాప్తప్రభాసురములై
పరగు మౌక్తికముల • బారు లనఁగ
రతిపంచశరులు సం • తతకేళి దేలుచుఁ
బనివడి యాడు పూ • బంతు లనఁగఁ
దివ్యవిల్తుఁడు రెండు • తెరఁగులై యిరువుర
కడ లంది యేయు మా • ర్గణము లనఁగఁ
దనవలనను వీరు • దనరారి రసచుఁ జం
ద్రుఁడుఁ జల్లు నమృత బిం • దువు లనంగఁ

తే జెలఁగు నయ్యామినీపూర్ణ • తిలక బిల్హ
ణాఖ్య కవివర్యుచూపు ల • న్యోన్యమైత్రి
నొలయుచు గతాగతంబులై • కలయ నలరి,
వెలయఁ జూచిన జనులకు • వేడుకయ్యె.

తే. బలితముగ విప్రులు 'తదేవంలగ్న'మనుచు మంత్రి
ములుపాడ శుభవీక్షి ♦ మహితలీల
వరుస నుంచిరి యవ్వధూ ♦ వరుల నృపతి
యనుమతంబున నైదువు ♦ లపుడువేడ్క.

తే. పుడమివేల్పులు పుణ్యాహ ♦ పూర్వకముగ
దేవతాహ్వాన మొనరించి ♦ తివిరి వారి
కరములను గంకణములు వే ♦ డ్కను ఘటించి,
చదివి రెంతయు మంగళా ♦ ష్టకము లపుడు.

మ. పొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ ♦ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్యనిచ్చు పగిదిన్ ♦ క్ష్మాదేశ ముఖ్యంబుగాఁ
బొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ ♦ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్యనిచ్చె సుమన ♦ స్సంతానముల్ మెచ్చఁగన్.

క. తలఁబ్రాలు పళ్ళెరంబులు
వెలఁదులు పార్శ్వములఁబూన ♦ విభుని శిరమునన్
జలజాక్షి మంచిదోయిటఁ
దలఁబ్రాలును బోసె విభుఁడుఁ ♦ దన్పై నించెన్.

వ. ఇట్లన్యోన్యాతిశయంబునఁ దదుత్సవంబు గావించి విధ్యుక్తప్రకారం బుగఁ బ్రధానహోమంబులాదిగాఁగలవి యాచరించి బంధుసహితం బుగా భోజనాదికృత్యంబులు నెరపి శేషహోమాదికృత్యంబు లను వర్తించి భూసురులకు మ్రొక్కి తదాశీర్వచనంబులు గైకొని బిల్హణుం డును యామినీపూర్ణతిలకయును యథేష్టభోగంబు లనుభవించునెడ.

సీ. నీలమేఘంబులు ♦ శైలాగ్రములవ్రాలెఁ
బరికింప వెన్నెల ♦ బారె విధుఁడు
సన్నగించె బిక ♦ స్వరము లంతంతకుఁ
గలహంసలునుదమ ♦ గతులు దప్పె
గగనమార్గము సావ ♦ కాశమై పొలుపొందె
నహిరాజు రూఢియఁ ♦ దంద నిలిచెఁ
గేతకీదళములు ♦ గెలకుల భాసిల్లె

మెఱపుఁదీఁగలు మింటఁదఱచు మెఱసె

తే. నంద మొప్ప గఁ గొలఁకులఁ నందు నొడమె
నాడ కాడకుఁ గోరక ♦ లతిశయిల్లె
ననుచు జనులెల్లఁ బొగడ ఘ ♦ నాగమమున
గర్భగౌరవ మాకాంత ♦ కాంచెనంత.

వ. ఇట్లు నవమాసంబులు నిండి దశమంబగుమాసంబునం దొక్క సుము
హూర్తంబున.

సు. మరుదంకూరము సంచరింప గ్రిహముల్ ♦ మూర్ధాండసంయుక్తిచే
నరయన్ దిక్కులు డెల్పఁ జెంద గరిమన్ ♦ దివ్యన్మృదంగాదిహా
ద్యరవంబుల్ సెలఁగన్ సురప్రితతి యు ♦ ద్యత్పుష్పవర్షంబు ల
త్తరి వర్షింప వధూటి కాంచెను సుతున్ ♦ ధైర్యైక భాగ్యోన్నతున్.

క. ఘనతం బ్రిభాకరోదయ
మున జనియించుటయు విప్రిముఖ్యులు వేడ్కం
గని లగ్నగతిఁ బ్రిభాకరుఁ
డను నామం బిడిరి బిల్హ ♦ణాఖ్యుఁడు మెచ్చన్.

వ. అప్పుడు మదనాభిరామభూమీధవుఁడు విద్వజ్జనబంధుమిత్రిపురోహి
తామాత్య సమక్షంబున నతిసిం దనవంశకర్తగాఁ బరిగ్రిహించి జాత
కర్మాదులు నలిపి గోభూతిలహిరణ్యాది షోడశదానంబులు చేసి
భూసురాశీర్వచనంబులంది

క. ఘనుఁడు ప్రభాకరుఁడంతన్
దినదినమును వృద్ధిఁబొంది ♦ దివ్యద్భులుఁదై
కనుపట్ట వానిఁబట్టము
చనువొప్పఁగఁ గట్టి సుఖము ♦ జయముం గాంచెన్.

మాలిని. ప్రిథితగుణకలపా భంజితేనచాపా
ప్రిథనవిజయకోపా భానుకోటిప్రితాపా
మథితదనుజభీపా మన్మథాచ్ఛస్వరూపా
మధురతరకలాపా మాన్యరామావనీపా.

శ్రీకృష్ణార్పణమస్తు.

# విజయవిలాసము.

గ్రంథకర్త:— చామకూర వెంకటకవి.

విజయవిలాసము విజయుని విలాసమే. యువకీయువకుల కుల్లాసముగలిగించి చెరుకు విల్కాని తీయములుకుల పాలుజేయునది విజయుడు తీర్థయాత్రల సల్పుచు యోగిరూపమున ద్వారకకు వచ్చుట యాదవులతనిని భజించి సుభద్ర నుపచారములు సల్పుటకు నియమించుట. సుభద్రార్జును లొండొరు లెదురెదురై లజ్జితులగుట. క్రమముగా సుభద్ర కతని యందనుమానము తగులుట. అర్జునుడు తన్నుదెలుపుకొని యామెను చేయిపట్టిలాగుట. కృష్ణుడు వేరొక యుత్సవ నెపంబున సుభద్రార్జునులకు బెండ్లిసేయుట మొదలగు పట్టులం జదువుచున్నప్పుడు చామకూరను కలలోగూడ నసహ్యించుకొనునీవు 'చామకూర పాకమునపడినది' అందువు. పద్యంబులన్నియు శృంగారరసగుళికలు చూడు మీపద్యరత్నమును.

అత్తవారింట సకల భాగ్యంబులున్న
మగనిమీదట తన కెంత మక్కువున్న
ఆడపుట్టువు పుట్టింటి కాసపడును
కావున సుభద్రమొక తీరుగాగనుండె.

వెల రూ. 1—0—0.

వలయువారు:—

కర్రా అచ్చయ్యా అండు సన్స్,
ఈశ్వర బుక్ డిపో,
రాజమండ్రి.

# మొల్ల రామాయణము.

గ్రంథకర్త్రి:— కవయిత్రి; ఆతుకూరి మొల్ల.

భక్తిముక్తుల నొసంగుటకు మూలకందమగు శ్రీరా[illegible]యణము నెందరెన్నిరీతుల వ్రాసినను తనివితీరని పవిత్ర ప్రశస్త గ్ర[illegible]రాజము. ఇల్లాలగు నీమొల్ల తెనుగుతల్లికి వెల్లివిరిసిన మల్లిమొల్లల క[illegible]పల్లి[illegible] సల్లలిత గ్రంథరాజమును కానుకగా నొసగి తెనుగుజాబిల్లిని[illegible] జేసింది. కల్లబొల్లిమాటలతో గాక జిగిబిగి యల్లికల పురుష[illegible] వ్రా[illegible]న యములు జల్లుమన తోడికవయిత్రుల గుండెలు గుభిల్లుమన, అన్యభా[illegible] షాకవి మల్లురు తల్లడమందునటుల రచించినది. కథ-రామకథ, కవయిత్రి సర్వసమర్థ, దానినిగూర్చి నేతవ్రాసినను తనివి తీరదని యుపేక్షవహించితిమి. పద్యరత్నంబులాంధ్రభాషాదేవికి గుణరత్నహారము మచ్చునకు పద్యరత్నములను నిందుబొందు పఱచితిమి.

చ॥ వలిపపు సన్నపయ్యెదను । వాసిగ గంధము పూతతోడుతన్
గొలదిగఁగానవచ్చు వలి । గుబ్బచనుంగవలీవి నొప్పఁగా
తెలుగని చెప్పఁబోటకడు । తేటువమాటలు క్రొత్తరీతులున్
బొలుపు వహింపకున్న మరి । పొందగు నొప్పునె యాంధ్రశబ్దముల్.

గీ॥ తేనెసోకనోరు । తియ్యన నగురీతి
తోడనర్థమెల్లఁ । దోచకున్న
గూఢశబ్దవితతి । కొట్లాటపనిమెల్ల
మూగచెవిటివారి । ముచ్చటరయ.

వెల రూ. 0—10—0.

వలయువారు:—

కర్రా అచ్చయ్యా అండు సన్స్,
ఈశ్వర బుక్ డిపో,
రాజమండ్రి.